50/50

# శ్రీ వాణి

(తమిళవేదం 'తిరుక్కురళ్' నకు అనువాదం)



డా॥ గాలి గుణశేఖర్

# శ్రీ వాణి

(తమిళవేదం 'తిరుక్కురళ్' నకు అనువాదం)

డా. గాలి గుణశేఖర్

ఎం.ఏ., ఎం.ఫిల్., పి.హెచ్.డి., (తెలుగు)
ఎం.ఏ., (తమిళం) ఎం.ఏ., (ఆంగ్లం)
కోవిద (సంస్కృతం) డిప్లొమా ఇన్ రష్యన్
పి.జి.డిప్లొమా ఇన్ ట్రాన్స్‌లేషన్

*నివేదిత పబ్లికేషన్స్*

24-34-1, యన్.జి.వో. కాలని
పుత్తూరు - 517 583

*SREE VANI - 'Thiruvalluvar's Tirukkural'*

Translated by **Dr. Gali Gunasekhar**

First Edition : October, 1993

Copies : 1000

Price : Rs.30/-

This book is published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their scheme 'AID TO PUBLISH RELIGIOUS BOOKS'.



For copies : **Smt. G. Pushpa,**
24-34-1, N.G.O's Colony,
Puttur - 517 583.

Printed at : *KEERTHI OFFSET PRINTERS,*
98, Prakasam Road, Tirupati.
✆ : 22973

# విజ్ఞప్తి

కడలి కంటె గంభీరంగాను, పర్వతం కంటె ఉన్నతంగాను, భూమి కంటె విశాలమైనది గాను కీర్తిగన్న తమిళ వేదం తిరుక్కురళ్ నకు అనువాదం ఇది. 4-10-88నుండి 22-8-89 వరకు - దీని రచనాకాలం. అనేకేతర గ్రంథాల వలెనె ఈ గ్రంథం గురించి, కవి తిరువళ్ళువర్ గురించి చారిత్రకాధారాలతో వివరాలు తెలియడం లెదు. ప్రచారంలో ఉన్న కథలపై భేదాభిప్రాయాలున్నాయి. పెక్కురు పరిశోధకపండితులు అంగీకరించిన కాలం క్రీ.శ. 3వ శతాబ్ధం.

వేమన పద్యాలు తెలుగు వారిలో ప్రాచుర్యం పొందినట్లే, తమిళులలో బహుళప్రచారం పొందిన గ్రంథం. వేమన పద్యాలలో ఉన్న ప్రక్షిప్తాలు ఇందులో లేవు. కారణం కవి నాడే శాస్త్రీయంగా ఈ గ్రంథాన్ని విభజించిన తీరు. త్రివర్గ (ధర్మార్థ కామ వర్గాలు) సూక్తులు మొత్తం 1330 రచించాడు కవి. ఇవి 133 సూక్ష్మవిభాగాలుగా, ఒక్కొక్కటి పది సూక్తులుగా ఉన్నాయి. వీటిలో 38 ధర్మ వర్గం, 70అర్థ విభాగం 25 కామవిభాగం గాను విభజింప బడ్డాయి. త్రివర్గాలలో ప్రతివర్గంలో విషయాను గుణంగా పేర్లు సూచింప బడ్డాయి.

అల్పాక్షరాలతో అనల్పార్థ రచన అన్నది ఈ సూక్తులకు అక్షరాల వర్తిస్తుంది. సార్వజనీనం, సార్వకాలీన మైన ఈ సూక్తులు అనేక భాషల్లోకి అనువదింపబడ్డాయి. తెలుగులో కూడ అనేకులు అనువదించారు. అనువాదానికి పూర్వంనేను శ్రీ శొంఠి శ్రీపతి శాస్త్రిగారి శ్రీ పదులు (1966), శ్రీ చె. రామలింగాచార్యగారి శ్రీ సూక్తులు (1978) అన్న గ్రంథాలను చూశాను. అనువాదానంతరం వెలువడిన శ్రీ ఆరుద్ర గారి దక్షిణ వేదం (1989),శ్రీ చల్లారాధాకృష్ణ శర్మ గారి తిరుక్కురళ్ (1989) గ్రంథాలను చూశాను. పై వారు కాక మరివది మంది పూర్తిగనో, పాక్షికంగానో అనువదించారని ఆచార్య శ్రీ చల్లారాధాకృష్ణశర్మ గారు తమ అనువాద గ్రంథ పీఠికలో పేర్కొన్నారు. ఇందరువిద్వత్కవులు, లబ్ధ ప్రతిష్టులు ఈ గ్రంథ అను వాదానికి పూనుకోవడమే గ్రంథ ప్రాశస్త్యాన్ని తెలియ జేస్తున్నది.

తిరుక్కురళ్ - తిరు శ్రీ శబ్దభవం. 'కురళ్' (రేఫ శకట రేఫ అయితే) ద్విపాదయుక్త మైనఛందోభేదం. మొదటి పాదం నాలుగు సీర్ - లుగ (తమిళంలో దాదాపు మనగణాల వంటివి) రెండవ పాదం మూడు సీర్ - లుగ ఉంటుంది. ఈ ఛందస్సులోనేసూక్తులన్నీ రచింప బడడం వల్ల ఈ గ్రంథానికీ పేరు. ప్రసిద్ధ మైన పేరు ఇదేఅయినా పది పేర్లతో ఈ గ్రంథం వ్యవహరింప బడింది. అలాగే కవి తిరువళ్ళువర్అనలు పేరు ఏదైనా ఆయన కూడ దశవిధ నామాలతో పేర్కొన బడ్డాడు.

కురళ్ శబ్దంలోని రేఫ లఘురేఫ అయితే వాక్కు, సూక్తి అనే అర్థాలు వస్తాయి. ఈ గ్రంథంలోనివి సూక్తులే గనుక 'తిరుక్కురల్' అన్న ఊహతో శ్రీవాణి అనిఅనువాద గ్రంథానికి పేరు పెట్టడం జరిగింది.

తేటగీతి లేదా ఆటవెలది ఛందస్సులో రెండు పాదాలుగా అనువాద రచన సాగింది. ఎక్కువ తేటగీతి పాదాలు. విషయాన్ని బట్టి ఈ రెండింటిలో ఒకటి తీసుకోవడంజరిగింది.

అనువాద రచనను పరిశీలించి, తమ అమూల్య మైన సలహాలనిచ్చి, మార్పులనుసూచించినవారు మా గురువర్యులు ఆచార్య వి. రామచంద్ర చౌదరిగారు. వారికినా కృతజ్ఞతాభి వందనాలు. గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయ మిచ్చిన వారుటి.టి.డి. నిర్వహణాధికారులు. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ అనువాద ప్రధానోద్దేశం - మూల విధేయతతో బాటు, అన్వయ క్లిష్టతలేకుండడం. సాధ్యమైనంత సరళ మైన భాషలో రచించడం, తద్వారా సామాన్యమైన భాషా పాండిత్యం కల వారైనా అర్థం చేసుకోగలగా లన్నది. ఈ ఆశయం ఎంత వరకు ఫలించిందో నిర్ణయించవలసింది సహృదయులు, విజ్ఞులైన పెద్దలు, పాఠకులు.

అభివాదాలతో

గాలి గుణశేఖర్

# విషయ సూచిక

ఈ గ్రంథం అచ్చయిన కంప్యూటర్‌లో శకటరేఫాక్షరం లేనందున ఆ చోట్లలో లఘురేఫాక్షరాన్ని స్వీకరించడం జరిగింది. ఇందులో చాలా పదాలు ఈ నాడులఘురేఫ తోనే ప్రసిద్ధమయినా కొన్ని పదాలకు అర్థభేదం కలిగే అవకాశంఉంది. పాఠకులు సహృదయంతో మన్నిస్తారని ఆశిస్తున్నాను.

ఆ పదాలు :

ఎరుక (జ్ఞానం) తరుగు (తగ్గు) చెరువు, ఎరుగు, ఉసురు (ప్రాణం) వరలు(ప్రవర్తిల్లు) కరచు (అభ్యసించు) కరవు (బోధించు) దూరు (నింద) దూరి (నిందించి)పిరుద (వెనుక) తేరు (తేటపడు), తేర్చు, వెరచు, వెరవు (భయం) తరి (సమయం)పరగు, జారు, కొరత, చిరు, మరి, ఏమరించు, మీరు (అతిశయించు) మరు, వేరు(భేదం) రేడు (ప్రభువు) పగరు (శత్రువులు) మరచు, మరపు (విస్మృతి) నెరి(న్యాయం) మొర (ఆర్తధ్వని), రాయి, సంశయమర (సందేహం లేక) మరుగు, పరచు, తెరగు, అరచు, కొరుకు, తొందర, విఱ్ఱవీగు, మారుపాటు, నరుకు, అరుగ దీయు, నూరు, గురి, పేదరికము, అరుగు మొదలగునవి.

# ధర్మవాణి

## ఉపోద్ఘాతము

### 1. దైవస్తుతి

అక్షరముల కెల్ల ఆది 'అ'కారంబు
అక్షయుండు జగతి కాది యౌను 1

చదివిన ఫలమేమి? సర్వజ్ఞ శుభపద
ముల నెపుడెద నిలిపి కొలువకున్న 2

అలరు నెద నమరిన అభవు పదంబులు
కొలువ సంతతంబు నిలుచు ముదము 3

ద్వేషరాగరహితు దెలియ గొలుచు వాడు
ఇడుమ లొందకుండు ఇహము నందు 4

తమము వలన గలుగు ద్వంద్వంబు లంటవు
భక్తి తోడ నెపుడు పరము గొలువ 5

ఇంద్రియముల నైదు నడచి యెనగు వాని
ననుసరించు వారె మనుదు రనవరతము 6

నిరుపమాను పదము, నెద నిలుపకున్న
మదిని చెలరేగు కలతల మార్చు టరిది 7

ధర్మసాగరు పదములు తలచు వారు
తక్క, పరులు భవజలధి దాట లేరు 8

అష్టగుణి పదముల నాశ్రయింపని తల
చెడిన ఇంద్రియముల చేరి యొప్ప 9

భవమహాబ్ధి నీదగలరు పరము పదము
గొలువ, నీదలేరు పరులు కొలువకున్న 10

# 2. వర్ష ప్రశంస

వాన చేత ధరణి వర్ధిల్లు కావున
అఖిల జగతి కద్ది యమృత మగును 11

భోజ్యవస్తుప్రదాతయై పొలుచు వాన
తాను నొక భోజ్యవస్తువై తనరు నదియె 12

వార్ధియుత జగమున వర్షము లేనిచో
ఆకలి గొని ప్రాణు లలమటించు 13

వాన రాబడి తరిగిన కానలేము
కర్షకు లరక దున్నిన కష్టఫలము 14

తాను రాక చెరుపు వాన, చెడిన వారి
కరుణ తోడ కురిసి కాచు వాన 15

మింటి నుండి చినుకు మంటిపై పడనిచో
గడ్డి సైత మిలను కానరాదు 16

కడలి నుండి జలము గ్రహియించి మేఘముల్
కురియకున్న యెడల తరుగు జలధి 17

అర్చనోత్సవాతిథ్యము లాదరణలు
సాగదు చినుకు లేనిచో జగతి యందు 18

తనకొరకయి చేయు తపమితరులకైన
ఈవి వాన లేక ఇలను లేవు 19

జలము లేనిచో జీవన మిలను లేదు
వాన లేక మంచి నడత కాన లేము 20

# 3. యతి ప్రస్తుతి

సత్ప్రవర్తకు లయి సాగు వారి నుతియే
గ్రంధరాజములకు గౌరవంబు 21

బంధరహితుల నిట ప్రస్తుతి చేయుట
చనిన వారి నెన్ని మనుట యగును 22

జననమోక్షమ్ములను రెంటి చక్కదలచి
ధర్మ మాచరించిన వారి దలప సబబు 23

ఇంద్రియ గజములను ఎరుకచే బంధింప
నదియె ఉత్తమగతి కగును విత్తు 24

ఇంద్రియేచ్ఛ నణచు ఎరుక గల జనుని
శక్తికి సురపతియె సాక్ష్యమౌను 25

మంచి కార్యమాచరించు వారుత్తముల్
ఆచరింపని జను లల్పు లంద్రు 26

కాంతి శబ్దరస స్పర్శ గంధ తత్త్వ
ముల నెరుగువాని యెరుకను వెలయు జగము 27

వాఙ్మహిమ గల పెద్దల వాగ్గరిమను
జగతి వెలయు మంత్రోక్తులె చాటుచుండు 28

గుణశిఖర మెక్కిన యతుల కోప మకట
క్షణ మయిన భరియించుట కష్ట మగును 29

సర్వజీవుల యెడ సదయుడైన నరుడె
పూత చరితుడైన భూమిసురుడు 30

# 4. ధర్మప్రతిపాదనము

కలిమికీర్తులు ధర్మము వలన కలుగు
అట్టి ధర్మవర్తన కన్న అధిక మేది? 31

జీవితమున తోడు చెలువగు ధర్మంబు
ఆచరింపకున్న నదియె కీడు 32

ఏకతమున నైన ఇల ధర్మము విడక
చేయు రీతి నెరిగి చేయ వలయు 33

నిర్మలముగ మనము నెగడిన ధర్మంబు
కల్మ షమగు మనము కాదు హితము 34

కోపమాశ ఈర్ష్య కుటిల వాక్కను నాల్గు
దరిని చేర్పకున్న ధర్మమగును 35

యువత నలనత లేక చేయవలె ధర్మ,
మదియె కాయుమ్ము నశియించు నవుడు తోడు 36

పల్లకిని మోయు వానికి పదవడి చను
మనుజ నడుమ ధర్మఫలము మాట వలదు 37

ధర్మపథము విడక తనరు వాని కదియె
భవము నడ్డగించు బండయగును 38

ఇంపు గూర్చు ధర్మ మెన్నంగ, కానిచో
కలిమికీర్తు లవని గలుగ బోవు 39

చేయదగిన పనులు చెలగు ధర్మంబన
తగని పనులె నింద్య తమము లవని 40

# 3. యతి ప్రస్తుతి

సత్ప్రవర్తకు లయి సాగు వారి నుతియే
గ్రంధరాజములకు గౌరవంబు 21

బంధరహితుల నిట ప్రస్తుతి చేయుట
చనిన వారి నెన్ని మనుట యగును 22

జననమోక్షమ్ములను రెంటి చక్కదలచి
ధర్మ మాచరించిన వారి దలప సబబు 23

ఇంద్రియ గజములను ఎరుకచే బంధింప
నదియె ఉత్తమగతి కగును విత్తు 24

ఇంద్రియేచ్ఛ నణచు ఎరుక గల జనుని
శక్తికి సురపతియె సాక్ష్యమౌను 25

మంచి కార్యమాచరించు వారుత్తముల్
ఆచరింపని జను లల్పు లంద్రు 26

కాంతి శబ్దరస స్పర్శ గంధ తత్త్వ
ముల నెరుగువాని యెరుకను వెలయు జగము 27

వాఙ్మహిమ గల పెద్దల వాగ్గరిమను
జగతి వెలయు మంత్రోక్తులె చాటుచుండు 28

గుణశిఖర మెక్కిన యతుల కోప మకట
క్షణ మయిన భరియించుట కష్ట మగును 29

సర్వజీవుల యెడ సదయుడైన నరుడె
పూత చరితుడైన భూమిసురుడు 30

# 4. ధర్మప్రతిపాదనము

కలిమికీర్తులు ధర్మము వలన కలుగు
అట్టి ధర్మవర్తన కన్న అధిక మేది? 31

జీవితమున తోడు చెలువగు ధర్మంబు
ఆచరింపకున్న నదియె కీడు 32

ఏకతమున నైన ఇల ధర్మము విడక
చేయు రీతి నెరిగి చేయ వలయు 33

నిర్మలముగ మనము నెగడిన ధర్మంబు
కల్మష మగు మనము కాదు హితము 34

కోపమాశ ఈర్ష్య కుటిల వాక్కను నాల్గు
దరిని చేర్పకున్న ధర్మమగును 35

యువత నలనత లేక చేయవలె ధర్మ,
మదియె కాయుమ్ము నశియించు నపుడు తోడు 36

పల్లకిని మోయు వానికి పదవడి చను
మనుజు నడుమ ధర్మఫలము మాట వలదు 37

ధర్మపథము విడక తనరు వాని కదియె
భవము నడ్డగించు బండయగును 38

ఇంపు గూర్చు ధర్మ మెన్నంగ, కానిచో
కలిమికీర్తు లవని గలుగ బోవు 39

చేయదగిన పనులు చెలగు ధర్మంబన
తగని పనులె నింద్య తమము లవని . 40

## గార్హస్థ్యము

# 5. గృహస్థ ధర్మము

తక్కు మూడాశ్రమ జనులు తగు పథమున
నిలువ తోడగుచు గృహస్థు నెగడ వలయు 41

సన్యసించిన వారు యాచకులు దీను
లట్టిరకు తోడయి గృహస్థు డాదరించు 42

అతిథుల భ్యాగతులు సుర ల్పితరులు మరి
తాను ధర్మపథము నందు తనర వలయు 43

నింద లేని ధనము నిండుగ పంచెడు
గుణము కలుగు బ్రతుకు గొప్పదౌను 44

ప్రేమ ధర్మములను ప్రీతితో గృహాజీవి
తమున నిలుప నదియె తగు ఫలితము 45

ధర్మపథమున గృహాజీవితమును నడప
ఇతరములు కోర జాలిన వేవి గలవు? 46

బ్రతుకు నీడ్చు జనులు పలువురిలో ధర్మ
భావ మున్న గేస్తు పావను డగు 47

ధార్మికుండై తదితరుల ధర్మపరుల
జేయు నరుని తాపసి కంటె శ్రేష్ఠు డంద్రు 48

ధర్మ మన్నింట గార్హస్థ్యధర్మ ముత్త
మమది నింద గనని దైన విమలతరము 49

ధర్మపథమున గేస్తుండు తనర నాక
వాసులౌ సురల నడుమ వైవ బడును 50

# 6. గృహిణి ప్రశస్తి

గృహమున కగు మంచి నడత, గేస్తు సిరికి
సరిపడు నటుల మనినచో సత్సతి యగు 51

ఇంటి కనువగు ధర్మము నింతి యెరుగ
దేని, యెన్ని యమరి యున్న నేమి ఫలము? 52

ఇంటి యాలు మంచిదేని కావలె నేమి?
ఇంతి చెడినదేని ఏమి మిగులు? 53

శీల సంపద స్థిరముగ చెంది యున్న
మగువ కంటె మించిన దొక మంచి కలదె? 54

దైవముల వీడి పతి గొల్చు ధర్మపత్ని
కురియు మనినంతనె పుడమి గురియు వాన 55

ప్రోచు తనను, పతిని బ్రోచు, కీర్తిని కాచు
శీలమును తిరముగ చెలియ బ్రోవ 56

కాపుగడ యగు నొకొ! కాంతను చెరనుంచ?
అతివ శీల మొకటె అగును రక్ష 57

కలికి పతిని గొలిచి కర్తవ్య మొనరింప
చెందు దేవలోక జీవితంబు 58

శీలహీన యైన చెలి గల వానికి
పరువు కూడ పోవు పగతు ముందు 59

శుభమదేది యనిన సుదతి శీలం బగు
అనుగు సుతులు తొడవు లౌట నిజము 60

# గార్హస్థ్యము

## 5. గృహస్థ ధర్మము

తక్కు మూడాశ్రమ జనులు తగు పథమున
నిలువ తోడగుచు గృహస్థు నెగడ వలయు 41

సన్యసించిన వారు యాచకులు దీను
లట్టిరకు తోడయి గృహస్థు డాదరించు 42

అతిథుల భ్యాగతులు సురల్పితరులు మరి
తాను ధర్మపథము నందు తనర వలయు 43

నింద లేని ధనము నిండుగ పంచెడు
గుణము కలుగు బ్రతుకు గొప్పదౌను 44

ప్రేమ ధర్మములను ప్రీతితో గృహజీవి
తమున నిలుప నదియె తగు ఫలితము 45

ధర్మపథమున గృహజీవితమును నడప
ఇతరములు కోర జాలిన వేవి గలవు? 46

బ్రతుకు నీడ్చు జనులు పలువురిలో ధర్మ
భావ మున్న గేస్తు పావను డగు 47

ధార్మికుండై తదితరుల ధర్మపరుల
జేయు నరుని తాపసి కంటె శ్రేష్ఠుడంద్రు 48

ధర్మ మన్నింట గార్హస్థ్యధర్మ ముత్త
మమది నింద గనని దైన విమలతరము 49

ధర్మపథమున గేస్తుండు తనర నాక
వానులౌ నురల నడుమ వెవ బడును 50

# 6. గృహిణి ప్రశస్తి

గృహమున కగు మంచి నడత, గేస్తు సిరికి
సరిపడు నటుల మనినచో సత్సతి యగు 51

ఇంటి కనువగు ధర్మము నింతి యెరుగ
దేని, యెన్ని యమరి యున్న నేమి ఫలము? 52

ఇంటి యాలు మంచిదేని కావలె నేమి?
ఇంతి చెడినదేని ఏమి మిగులు? 53

శీల సంపద స్థిరముగ చెంది యున్న
మగువ కంటె మించిన దొక మంచి కలదె? 54

దైవముల వీడి పతి గొల్చు ధర్మపత్ని
కురియు మనినంతనె పుడమి గురియు వాన 55

ప్రోచు తనను, పతిని బ్రోచు, కీర్తిని కాచు
శీలమును తిరముగ చెలియ బ్రోవ 56

కాపుగడ యగు నొకొ! కాంతను చెరనుంచ?
అతివ శీల మొకటె అగును రక్ష 57

కలికి పతిని గొలిచి కర్తవ్య మొనరింప
చెందు దేవలోక జీవితంబు 58

శీలహీన యైన చెలి గల వానికి
పరువు కూడ పోవు పగతు ముందు 59

శుభమదేది యనిన సుదతి శీలం బగు
అనుగు సుతులు తొడవ్వు లౌట నిజము 60

# 7. సంతాన సంపద

పొందదగు సంపదల లోన పొంద దగును
తెలియ వలసిన వానిని తెలియు సుతుల 61

నిందలేని సుతుల పొందగల్గిన చాలు
పాపమంట దేడు భవము లందు 62

కలిమి యనగ తనకు కలుగు సంతానము
కర్మ ననుసరించి కలుగు నదియు 63

బిడ్డ చిన్ని చేత పెట్టు బువ్వను తిన్న
అమృతమైన క్రిందె యగును రుచిని 64

సుఖమగును శరీరమునకు సుతుని దాక
చెలగి ముద్దు పల్కు వినుట చెవికి నింపు 65

వేణువింపగు, నింపగు వీణయనును
తన శిశువు ముద్దు వలుకులు వినని నాడు 66

చదువువారి నడుమ మేటి చదువరియయి
సుతుని నిలుప వలయు తండ్రి సొంపు మీర 67

తనకు ముదము గూర్చు తనయుల ధీయుక్తి
సర్వ మానవాళి సంతసిల్లు 68

తనయుని గుణవంతుడనగ తల్లి సంత
సించు, వాని గన్నంతకు మించి యపుడు 69

ఇట్టి తనయు పొంద ఎన్ని నోములు నోచె
తండ్రి యనుచు జనులు తలపవలయు 70

# *8. ప్రేమ కలిగి యుండుట*

ప్రేమ నణచు తాళం బేది? ప్రియుల బాష్ప
ములె తెలియజేయు ననురాగ మును పరులకు 71

ప్రేమగలవాడు ఎమ్ములున్ పెరల వనును
ప్రేమ రహితు డన్నియు తన ప్రియమున కను 72

ప్రాణములకు మెయికిగల బంధ మదియె
ప్రేమయుత జీవ ఫలమని పెద్దలంద్రు 73

ఇతరుల యెడ మైత్రి నిచ్ఛ కలుగ జేయు
ప్రేమ నెంచి చూడ క్షేమ కరము 74

ప్రేమ కలుగు వారు, ప్రీతి సంతనములు
బ్రతుకు పయన మందు బడయు మేలు 75

ధర్మ మునకు ప్రేమ తలవ తోడందురు
పుణ్యమునకు నదియె పొనగు తోడు 76

ఎండ కీటకంబు నేర్చు విధంబుగ
ధర్మమేర్చు ప్రేమ మర్మహీను 77

చెట్టెడారిలోన చిగురించు విధమగు
ప్రేమ లేని వారి పేద బ్రతుకు 78

మదిని ప్రేమ లేకున్నచో మనుజుడొందు
అవయవముల వలన ఫల మందు టెట్లు? 79

ఒడలు, నెనరు కలిగియున్న నుసురుగలది
లేనిచో నెముకలు దాల్చు లేకి మేను 80

# 9. ఆతిథ్యము

అతిథుల కుపకారము చేసి ఆదరింప
నదియె కూడిన సంపద కగు ఫలితము 81

బంధు జనుల విడిచి భక్షింప నయ్యది
అమృత మైన నేమి హానికరము 82

ఆశ్రయించు వారి కాతిథ్య మొనరించి
తోడుగాగ నున్న కీడులేదు 83

బంధువులను చేర్చి పాలించు వానింట
తాండవించు లక్ష్మి తప్పకుండ 84

అతిధికిడిన పిదప ఆరగించెడు వాని
పొలము పండుట కయి బీజమేల? 85

ఉన్న యతిథుల మన్నించి ఒరుల కొరకు
అరయు నతడు స్వర్గమునకే యతిథియగును 86

అతిథి సత్కార జనితమౌ యజ్ఞఫలము
అతిథి యోగ్యత నయ్యది యనుసరించు 87

ధనము కూర్చియు తరిగె తోడనగ వగతు
రతిధి బ్రోచు మఖ మొనర్ప నట్టివారు 88

కలిమియుండి యేని కటిక దరిద్రుండు
అతిథి నెంచకుంట అల్పుడగును 89

వాసన గనినంత వసివాడు సుమమట్లు
పెడమొగ మిడగేన్సు వడలు నతిథి 90

# 10. మధుర భాషణము

ప్రేమమిళిత నిష్కపటమౌ ప్రియవచనము
మంచి వారు నుడువ నది మధురమగును 91

వదన మలర పలుకు టదియె శ్రేష్ఠంబగు
ఎన్నగ మది యలరి యిడుట కంటె 92

ఇమ్ముగ గని, మోము నింపుగనిడి, మన
మలర మాటలాడ నది మధురము 93

మంచి మాట పలుకు మనుజుని విడిపోవు
దుఃఖదాయి లేమి దూరముగను 94

నెనరు గల్గుమాట వినయ గుణంబులె
యౌను తొడవులు పెర లగునె చూడ? 95

పరుల మేల్గోరి లెస్సగా పలుక వలయు
తరుగు పాపము, ధర్మము పెరుగు ధరను 96

పరుల కుపకరించు పలుకు లాడిన చాలు
సత్ఫలములు వాని సరస జేరు 97

బాధ కలుగ జేయు పలుకు పరిహరింప
ఇహపరమ్ములందు ఎనగు సుఖము 98

మధుర భాషణమున మన మలరుట జూచి
పరుషములగు వాని పలుక నేల? 99

భవ్యవాక్కులుండ పరుషము లాడుట
పండు విడిచి కాయ బడయు టగును 100

# 11. కృతజ్ఞత

మేలొనర్చని వానికి మేలు సలుప
స్వర్గమర్త్యమ్ము లద్దాని సమము గావు 101

ఉచిత కాల మెరిగి ఒనరించు సాయమ్ము
భూమికంటె మించి పూజ్యమగును 102

ఫలము కోరకుండ పరులకు మేల్జేయ
కడలి కన్న నద్ధి ఘనము గాదె 103

మేలు కొంచెమైన మేల్మిగా భావించు
ఫలిత మందు వాడు పలు విధముల 104

మొదటి మేలు సమము కాదు బదులు మేలు
పడయువాని నైజము మేర ప్రతిఫలించు 105

సాధువుల, కష్టములయందు సాయపడిన
మానవుల మైత్రి నెన్నడు మరువరాదు 106

జన్మలెన్నియైన సాయము మరువరు
ఆర్యులైన వారు అవని యందు 107

మేలు మరచు టెపుడు మేలిమి కాదిల
కీడు మరచు టెల్ల పాడియగును 108

సాయ మొసగి నరుడు చావు దెచ్చిన కూడ
తొలుత మేలు తలప తొలగు చింత 109

ధర్మ మెద్దియైన తప్పనగును కాని
మేలు మరతు రేని మిగుల కీడు 110

# 12. మధ్యస్థము

యుక్త విధిని చేయు టుత్తమంబది ధర్మ
పక్షపాత రహిత పథము దెలువు 111

సిరులు చెడవు, కులము పెరుగు, హితము గూర్చు
తన విధిని నలిపెడు ధార్మికునకు 112

తనకు హితము కూర్చిన కూడ ధార్మికుండు
పక్షపాతమ్ము విడనాడి బ్రతుక వలయు 113

తగిన వారు తగని వారనగ తమతమ
సంతతి గుణములను బట్టి జనులు గాం్రతు 114

కీడు మేలు కర్మల బట్టి కెరలు చుండు
కాన విజ్ఞులు సమదృష్టి గాంచమేలు 115

మనసు పక్షపాతము జూప మరి పతనము
నిక్కమని యెరుగ వలయు నీతిపరుడు 116

పక్షపాత రహితుడైన దక్షుడవని
లేమి గన్నను లోకువ లేని వాడు 117

త్రాసు భంగి మనిషి తానొక వైపుకు
మ్రొగ్గ కున్న చాలు మ్రొక్కు గొనును 118

మనము తిరము గలిగి మాట వక్రత లేక
బ్రతుకు జనుడు పక్షపాతిగాడు 119

పరుల సొమ్మును తనదిగ పరిగణించి
పరల సత్సంప్రదాయము వర్తకులకు 120

# 13. వినయము

వినయ మున్నట్టి వాడగు వేల్పు, లేక
గాఢతిమిర జీవితపథ గమనుడగును 121

వినయమును తిరముగ వెలయింప వలయును
జీవికంతకంటె తావి లేదు 122

సత్పథమున వినయమున సంచరింప
నెరిగిన, సుజనుడది చూచి యితవు సేయు 123

తన పథము విడువని వినయవంతు ఘనత
గిరి శిఖరము కన్న ఉరుతరమ్ము 124

అధిక హితము గూర్చు అడకువ యెల్లర
కదియె ధనికి నైన నధిక ధనము 125

ఒక్క జన్మను తాబేలు ఫక్కి నింద్రియముల
నడచ జన్మలన్నింటిని ననుసరించు 126

జిహ్వనైన కాని చెరనుంచ కున్నచో
మూర్ఖ వాక్కు చేత ముప్పనొందు 127

పలుకు వలనను చేటొండు కలిగినంత
ధర్మ ఫలములు సర్వము తప్పిపోవు 128

అగ్ని గాయమైన అణగారిపోవును
నాల్క గాల్చు పుండు నయముగాదు 129

కినుకలేక, చదువుకొని వినయము గల
మనుజునెపుడు ధర్మమనుసరించు 130

# 14. సచ్ఛీలము

శీలమున్నతి గల్గించు, జీవి దాని
ప్రాణమున కన్న మిన్నగా పరిగణింప 131

వూని శీల మెవుడు బ్రోవవలయు, జ్ఞాని
కైన తోడు శీల మగుచు నుండు 132

గుణిదె యుత్తమ కులముగ గణనకెక్కు
అవగుణి కుల మనగ నది అథమకులము 133

ఆగమముల మరచి అరయంగ నగుకాని
గుణము చెడిన పిదప కులము చెడును 134

ఈర్ష్య గలుగ బుద్ధి హీనుడగు నటుల
శీలరహితుడైన చెడుగున బడు 135

శీలము విడిచి వర్తింప చేటగుటను
గాంచి దృఢచిత్తు లద్దాని గాచుచుంద్రు 136

మంచి నడత గలుగ మాన్యుడగును, చెడు
నడత గలుగ నింద బడును నరుడు 137

సత్ప్రవర్తన మోదము సలుపు చుండు
దుష్ప్రవర్తన సతతము దుఃఖమొనగు 138

తప్పి కూడ మాట తప్పిదంబును గొవ్వ
శీలము గలవాడు చేయరాదు 139

సర్వ శాస్త్రములను చదివిన వాడైన
మంచి నెన్నకున్న మందు డగును 140

# 15. పర భార్యను మోహింపమి

పరుని భార్య గోరు పతనము ధర్మార్థ
ముల నెరిగిన వారి ముందు రాదు 141

పరుని యాలి గోరు పరమ మూర్ఖత వల్ల
వచ్చు చేటు మించి వసుధలేదు 142

తన్ను నమ్మ్మ వాని ధర్మపత్నిని గాంచి
చెరుప నెంచు వాడు చెడిన శవము 143

ఎంత వాడయినను చింతలేక పరుని
ఆలి కడకు నేగ అందమేమి? 144

ఇది సులభమని పరు నిల్లాలి గోరిన
నిరతము కఠినమగు నిందల బడు 145

భయము, నింద, పగయు పాపములను నాల్గు
పరుని యాలి గోర పాయకబ్బు 146

పరుని యాలి గోరి మరులు గొనని వాడు
తప్పుదారి పోని ధార్మికుండు 147

మగటిమియన పరుని మగువను కోరమి
ఆర్యులాదరింప నదియె తగును 148

పరవనితల భుజములను పరిగణింప
నడరని జనుడు మేలున కర్హుడగును 149

ధర్మము విడిచినను ధరపరునాలిని
కోరకుండు టదియె గొప్పదనము 150

# 16. సహనము

తన్ను ద్రవ్వు చున్న ధర యోర్చు నట్లుగ
ఒరులు నింద జేయ నోర్వ నగును 151

ఒరు లపకృతి జేయ నోర్వంగ మేలగు
మరువ నంతకంటె మంచి యగును 152

లేమియన నతిథికి లేదను నిరనన,
ఓగొనర్చు కీడు నోర్వ బలము 153

నెరవు గోరు నరుడు నిశ్చలముగ నోర్మి
కలిగి యుండవలయు నిల నుతింప 154

ఎగ్గు కెగ్గు సేయ నిల కల్గు నవకీర్తి
సహనమున్న కల్గు చాల కీర్తి 155

ఎగ్గు కెగ్గు సేయ నెనగెడు నానంద
మల్ప, మోర్మి యొకటె నిల్పు కీర్తి 156

పరుల కీడు వలన బాధయె కలిగిన
ధర్మహాని జేయ దగదు జనుడు 157

గర్వి చేటొనర్ప గనవచ్చు జయమును
సహనమను గుణము సహకరింప 158

ప్రల్లదము మితి మీరిన నుల్లమోర్మి
గనినవారు, పూతాత్ములు మునుల భంగి 159

తినక తప మొనర్చెడువారు ఘనులె కాని
విరసవాక్కు నోర్చెడు వారి వెనుక వారె 160

## 17. అనసూయ

మదిని ఈర్ష్యలేక మనుగడ సాగించు
నైజ మలవడుటయె నరుని కింపు 161

ఎవరి యెడను మదిని ఈసు పొడమ కున్న
దాని కెన యగునదితరము లేదు 162

ధర్మమును, పెంపును విడువ దలచువాడు
పరుల పెంపును గని ఈర్ష్యపడెడు వాడు 163

దుఃఖ మీసు వలన తోచు టెంచి ఘనులు
ధర్మరహితములను తలప రెపుడు 164

ఈసు మించు శత్రు వెందును లేదది
పగతు కన్న హాని పరగజేయు 165

పరుల కొనగ నీసు పడు వాని చుట్టముల్
కూడ పొంద లేరు కూడు గుడ్డ 166

ఈసు గలుగు వాని నీసున గని లక్ష్మి
సోదరికి నతనిని జూపి చనును 167

ఓర్వమి యను పాప మొకడు పొంద, సిరిని
చెరపు, తగని పనులు గరపు నదియె 168

ఓర్వమి కగు పెంపు ఓర్చు వానికి నగు
కీడు, పరిగణించి చూడవలయు 169

ఓర్వకుండిన గైరవ మొందలేరు
సహనమున్న గౌరవహాని జరుగబోదు 170

## 18. అత్యాశలేకుండుట

పరుల సిరిని జూచి పడయ నిష్ట పడిన
కులము చెడును; భువిని కలుగు నింద 171

పక్షపాతమునకు భయపడు సుజనుడు
ఒరుల సిరిని బడయు నోగు కాడు 172

ధర్మమున పరమానంద మర్మమెరుగు
వాడధర్మ కార్యములను వదలిపెట్టు 173

ఇంద్రియజితుడైన నిహామున లేమిని
పడినను పరుల సిరి బడయ కుండు 174

ఈసుతోడ పరుల కెగ్గు సేయు నతడు
విజ్ఞుడైన ఫలము వెలయు టేది? 175

ధర్మపరుడైనను పరుల ధనము కోరి
తగని పనులు చేసిన జాలు తప్పులు చేటు 176

పరుల పెంపు వలన పడయు పెంపు, ఫలిత
మెంచు నపుడు కనికరించు టరిది 177

సిరులు తరుగ కుండ చెలగ వలెననిన
పరుల కలిమి కాశ పడుట తగదు 178

ధర్మమెరిగి పరుల ధన మోర్వగను వాని
తగిన చోటిది యని ధనము చేరు 179

పరుల ధనము గోర పతనమ్ము జెందును
కోరకున్న జయము కోరివచ్చు 180

## 19. పరోక్షమున నిందింకుండుట

ధర్మ మెంచక, చెడుచేయ తలవడినను
కొండెములు పలుక డనుట మెండు కాదె? 181

మంచి దూరి యధర్మము నెంచు కంటె
వెనుక దూరి ముందు పొగడు విధము కీడు 182

పరుని దూరు బ్రతుకు కంటె, పడయులేమి
చావు మేలని నీతి శాస్త్రములు పలుకు 183

పరున మెదురపలికినను పలుకరాదు
నింద, లేని ఘనుజు గూర్చి నిశ్చయముగ 184

ధర్మము తగదని యొకడు తలచు విధము
వెనుక నిందలాడు గుణమె విశద పరచు 185

ఒరుల దూరు వాడు పరులచే లోపము
లెంచ బడుచు నింద గాంచు చుండు 186

అలరు భంగి నెయ్యంబున పలుకలేని
వాడు, నిందజేసి సఖుల వదలివేయు 187

ప్రియ సఖుల గురించి పిరుదదూరుజనులు
పరుల మంచి నెట్లు పలుక గలరు? 188

తలప, దూరు వానిని కూడ దాల్ప ధర్మ
మని భరించు చున్నదొ యేమొ అవని మాత 189

పరుల తప్పులెంచు నరులెప్పు తమతప్పు
గాంచ, బ్రతుకు దుఃఖ గాథ కాదు 190

## 20. వ్యర్థ ప్రసంగము చేయకుండుట

పరులకు వినుగు పుట్ట నిష్ఫలపు మాట
లాడ నిందింతు రెప్పుడు అవని జనులు 191

సఖుల కహితములను సలుప కీ, డంతకు
కీడు వ్యర్థ వాక్కు లాడుట యన 192

ఫల రహితము లయిన పలుకు లధికమైన
ధర్మ హీనుడనగ తలచు పుడమి 193

పలుపురి కడ నయరహిత ఫల విహీన
వాక్కు లాడ ధర్మము గాక వ్యర్థము లగు 194

పేర్మి, మేలిమితో పోవు పెద్దలైన
మంచి వారు వ్యర్థంబుగ మాటలాడ 195

ఫలత మీని మాట పలుమార్లు పలికెడు
వాడు నరుడు కాడు వ్యర్థుడగును 196

ఆర్యులైన వారహితము లనిన కూడ
ప్రస్తుతము కాని మాటలు పలుక రాదు 197

అరుదగు ఫలితముల నరయ గల వివేకి
ఫలరహితము నెపుడు పలుక లేడు 198

మరులు వీడి తేరు మహితాత్ములెన్నడు
పొరబడియు పలుకరు పొల్లుమాట 199

పలుకవలయు నెపుడు ఫలమిచ్చు వానిని
ఫల విహీనములను పలుకరాదు 200

# 21. పాపభీతి

దురితములను జేయ దుష్టుడు జంకడు
సచ్ఛంతుడు చేయ జంకు గొనును 201

చెడుగు పనులు చేయ చేటుగలుగు గాన
జ్వాల గనిన భంగి జంక వలయు 202

చెడుగరంబునకైనను చెడు తలపమి
ఎరుక లన్నింటిలో గొప్ప ఎరుకయగును 203

మరచి యేని చేయ దగదు పరులకు చెడు
చేయ ధర్మమె యతనికి చేటొనర్చు 204

పేదనని యెంచి చెడు తలపెట్ట రాదు
పెరుగు నద్దాని కతమున పేదరికము 205

చెడుగు వలన బాధ జెంద గోరని వాడు
దాని నితరుల యెడ తలపరాదు 206

పగ కలిగియున్న తప్పింప వథము గలదు
చెడుగు వలన గల్గు ఫలము చెరుపగాదు 207

చెడుగొనర్చువారు చేటు గనుట, నీడ
వెంబడించి వచ్చు విధముగ నగు 208

తన్ను దాను ప్రేమించుచు తనరు వాడు
చెడుగు స్వల్పమె యయినను చేయరాదు 209

చెడుగొనర్పక పెడదారి నడవనపుడు
కలుగ దెప్పుడు కీడని తెలియ నగును 210

# 22. లోకానుగుణవర్తనము

ఫలరహిత హితము సలుప పాడియగును
హితము గూర్చు వానకు జను లిచ్చుడేటేది? 211

అర్హులైన వారి నాదు కొనుటకగు
చెమటనోడ్చి సొమ్ము జేర్చుటెల్ల 212

పరుల కొనగు మేలున కంటె మరొక మేలు
ఇహపరముల పొందదగిన దేది కలదు? 213

ఒప్పు నెరిగి పరుల కొసగ ప్రాణము గల
వాడగు, తదితరుడు వట్టి శవము 214

నీరు నిండిన కొలనూరి కుపకరించు
భాతి నొప్పు జ్ఞాని పడయు సిరులు 215

పల్లె నడుమ నున్న ఫలవృక్ష మొదవెడు
భంగి యగును నీతి పరుని సిరులు 216

అంగములకెల్ల నౌషధ మగుచు నొదవు
చెట్టు వలె నగు నన్మతి సిరులు భువిని 217

సిరితరిగిన కూడ ఒరుల కుపకరింప
జంకరు నయవిదులు సత్యమిలను 218

లోకహితుడు లేమి లోన బడుట, చేయ
దగిన వాని విడిచి తలగి చనుట 219

ఉపకృతిని కీడొదవిన నయ్యవనయమును
తనను అమ్ముకొని యయున కొనదగినది 220

## 23. దానము

ఈవి, లేని వాని కిచ్చుట;ఫలితము
దలచి యొసగుట యగు తదితరములు 221

పడయుట యుచిత మైనను పాప, ,మీవి
స్వర్గమది లేనిదైనను నన్మతంబు 222

కోరకయె యొసంగు గుణము గల్గు నతడు
మంచి పుట్టు వంచు నెంచ వచ్చు 223

అడుగు వాని వదన మలర నిచ్చువరకు
అడుగు వాని జూడ యాతన యగు 224

తపముచే నాకలి నడప తగు బలమగు
పరుల క్షుత్తు తీర్చు నతని బలమధికము 225

ఒనగి ఆకలి పోగొట్ట, నొదవు సిరులు
పిదప కాలంబున తనకు పేర్మి మీర 226

అన్నము పలువురికి పంచి ఆరగింప
చెంతనాకలి రోగము చేరదెపుడు 227

పరుల కీని యెడల వతనమౌ సిరులు తా
వరుల కొసగు తృప్తి పడయకుండు 228

తరుగు సిరిని నిలువ పరుల కీక తినుట
భిక్షమడుగు కంటె పెద్ద చేటు 229

చావు కంటె దుఃఖము లేదు, చావెనుఖము
లేని వాని కీయని కడులేమి కంటె 230

# 24. కీర్తి

ఈయవలె, దరిద్రున కిచ్చి ఇహము నందు
కీర్తి గాంచ వలె నదియె కెలవు బ్రతుకు 231

పొగడు వారి పలుకు లెల్ల భువిని లేని
వారికి సిరు లిచ్చి మనిన వారి జెందు 232

అవని సాటి లేనిది కీర్తి అంతకంటె
ఇహమున నిలుకడగ నున్న దేది కలదు? 233

పుడమి చిరకీర్తి నెలకొన్న పురుష దప్ప
స్వర్గలోకము పొగడదు జ్ఞాని నైన 234

యశమున సిరి తరుగుటయు, యశము తోడ
చావు. పుణ్యాత్ములకె గాని సాధ్యపడదు 235

మనిన కీర్తితోడ మనవలె, లేనిచో
ధరణి పుట్టకుంటె ధన్యమగును 236

పరులు పొగడునట్లు బ్రతుకక నిందలు
పడిన, బదులు నింద పలుకు టేల? 237

తమకు పిదప నిలుచు తగుకీర్తి లేనిచో
లోకుల కడ బ్రతుకు లోకువ యగు 238

నింద్యుల భరించిన పుడమి నిశ్చయముగ
ఉన్నత మగుఫలితముల నొసగ దెపుడు 239

నిందలేని బ్రతుకు నిజమగు; జీవచ్ఛ
వమగు కీర్తి లేక వరలు వాడు 240

## III సన్యాసము (a) వ్రతభాగము

## 25. కరుణ

హీనుల కడను సంపద లెనగు చుండు
ఒదవెడు కరుణ యను సిరి ఉత్తమంబు 241

సత్పథము నవలోకించి సదయు డగుచు
మనవలె నదియె బ్రతుకున మంచి తోడు 242

తెలివి లేమిచే దుఃఖము కలుగు చుండు
కరుణగల మనుజుల కది కలుగ బోదు 243

పుడమి జీవుల కరుణతో బ్రోచు వాడు
ఉసురుకై జంకు దుష్కర్మ నొందడెపుడు 244

కరుణ గలుగు వారికి లేదు కలత, దీని
కనిల యుత మగు భువి నున్న జనులు సాక్షి 245

దయను వీడి కానివి చేసి తనరు జనుల
ధర్మలక్ష్మరహితు లని తలతు ధుర్వి 246

కలిమి లేక యిల సుఖము కలుగనట్లు
ప్రాణుల యెడ కరుణలేక పరము లేదు 247

పేదయెన్నడేని పెంపు గాంచ నగును
కరుణ లేని వారు గాంచలేరు 248

జ్ఞాన హీను డెరుగు గ్రంథ సారము వలె
నగు కరుణలేని వాని ధర్మాచరణము 249

ఎల్లిదుని గాంచి నగు ముందు బల్లిదుండు
తాను భయపడు విధమును తలప వలయు 250

## 26. మాంస విసర్జనము

తన శరీరము పెంపొంద, తలప వేరు
జీవి భక్షింప నది దయా జీవి యగునె? 251

సిరి వలన గౌరవం బది చెడిన లేదు
పొల దిన కృప కగు ఘనత పొంద లేరు 252

కత్తి చేత ధరించిన కటిక వాని
మనసు వలె నుండు పొలదిను మనుజుని మది 253

కరుణయన నహింస, కరుణ కానిది హింస
తనువు రుచి గనుట యధర్మ మగును 254

మాంసము తినకున్న మనును జీవులు, తిన
నరకలోకమునకు నరుడు చేరు 255

పొలను దినగ జీవి బొలయింపని యెడల
విక్రయింప లేరు వెలకు దాని 256

పలలము తిన రాదు తెలియగ నది యొక
మేని పుండు గాని మేల్మి గాదు 257

దొసగులేని తెలివి దొరకొనిన జనులు
పొలను తిండి మాని పొలయఘు వారు 258

యజ్ఞములు వేయొనర్చుట కగును మిన్న
ఒక్క ప్రాణి జంపి పొలను నొల్లకున్న 259

మ్రొక్కు ప్రాణులు, మాంసము మెక్కకుండి
చంపు గుణ ముజ్జగించిన జనుల వదము 260

# 27. తపము

కష్ట మోర్చి జీవుల యెడ కరుణ జూపి
హింస చేయ కున్న నదియె యిల తప మగు 261

పూర్వకృతము చేత పొలువగు తవమది
లేని యెడల ఫలము లేదు జగతి 262

సన్యసించిన వారిని సత్కరింప
దలచి మరచిరో గేస్తులు తపము జేయ? 263

మిత్రుల యభివృద్ధి శత్రుల నాశము
తలచి నంత నగును తపము వలన 264

కోర్కె లెల్ల మదిని కోరి నట్లగు గాన
తపము పూని చేయ దగును ధరణి 265

తపము చేయువారు తమ విధి నలిపెడు
వారు;పరులొయాశలబడి వగచు వారు 266

కాల్చుకొలది బంగారము కాంతులీను
నట్లు కలత పెరుగు చుండ నలరు తపము 267

తపము చేత, నుసురు తానను బంధము
వదల ప్రాణు లెల్ల వందన మిడు 268

తపముచేశక్తి గాంచిన తాపసులకు
జముని నిర్జించు టైనను సాధ్యమగును 269

తప మొనర్చు వారు తక్కువై యుండుటే
ప్రతిభ లేమి వారు పలువు రగుట 270

## 28. కూఢని ప్రవర్తన

వంచకుని వర్తనము గాంచి వాని లోని
పంచ భూతాలు తమలోన పరిహసించు 271

మనసు నేరమున లయింప మరి తపమున
మిగుల మిన్నంటినను నెట్లు మేటి యగును? 272

గోవు పులితోలు గొని గడ్డి కోరి మేయు
నట్లగు బలవంతపు తప మాచరింప 273

పొదను దాగి వలని పన్ని పుల్గు బట్టు
వేటగాడగు తాపసి విధులు మరవ 274

ఆశ లడుగంటె నని చెప్పి అక్రమములు
సలుప నొకరోజు కలతలు సరన జేరు 275

రాగములు విడువక బంధరహితు డనెడు
వాని బోలిన యదయు లీ వసుధ లేరు 276

పైని గురివెంద వలె దోచి లోన దాని
నల్లని మొనవు నెనయగు నరులు గలరు 277

నీటిచే బాహ్యశుద్ధత నెరపి మదిని
మలిన వర్తను లగు వారు మహిని గలరు 278

బాణము ఋజు వయ్యును వాడి, వీణ వక్ర
మయ్యు నింపు, మనుజుల నట్లరయ వలయు 279

నీచవర్తనముల నిరసించిననె జాలు
ముండనములు జడలు దండుగ యగు 280

## 30. సత్యము

కష్టమే మాత్రమైనను కలుగ నీక
సదయ మాటాడగా నది సత్యమగును 291

నేరరహిత హితము గల్గ, నిజము కాని
మాటకూడ సత్యమగుచు మహిని జెల్లు 292

తన మన మెరుగు వానిని తలచి కల్ల
లాడిన నదియె హింసించు నాత్మ నంత 293

మన మెరిగి కల్ల లాడని మనుజు డెపుడు
జనుల మనముల నెలకొని సంచరించు 294

తపము, దానములను ధర నొనర్చుట కంటె
కల్ల లాడకున్న కలదు సుఖము 295

కల్ల లేని బ్రతుకు కలిగించు నున్నతి
అన్ని ధర్మములకు నదియె నెలవు 296

సత్యపథము విడక జరుపు జీవితమున
ధర్మ మరసి తలను దాల్చవలయు 297

బాహ్య శుభ్రత నీటిచే బడయ నగును
సత్యమున లోని శుభ్రత సాధ్యమగును 298

దీపములు దీపములు కావు తెలియ శుభ్ర
చరితులకు నెల్ల దీపము సత్యమగును 299

నేనెరిగిన యన్నింటిలో నిజముకంటె
ఉన్నతమ్ముగ నెన్న వేరొండు లేదు 300

## 31. శాంతము

చెల్లినపు డోర్వ శమమగు చెల్లనపుడు
చెందకున్న నేమి? కినుక చెందనేమి? 301

చెల్లనపుడు కినుక చెంద కీడౌనగూడు
చెల్లు చోటు నైన చేటు కలుగు 302

మరచి పోవలయును మనుజుపై కోపము
చెడుగు కినుక వలన చెలగు చుండు 303

సంతసంబు, హాసములను సంహరించు
పగ, కినుక కంటె వేరొక పగయె లేదు 304

అలుక నడచవలయు నది రక్ష, కానిచో
తన్ను చంపుట కది తగిన దగును 305

కినుక తనను గాల్చు తన వారను ముదము
నిచ్చు తెప్ప గాల్చు చిచ్చు వోలె 306

కరము నేలపై గ్రుద్దిన కమలు భంగి
కినుక నుపకరిణంబుగ గొనునతడగు 307

అగ్ని కీలల బడినంత హాని నొకడు
చేసినను నయము కినుక చెందకున్న 308

కోప మింత యంతయు మదిని కోరకున్న
ఎంచిన సుఖము లన్నియు నిమ్ముగ నగు 309

మితి గనని కోప మున్నచో మృతుల వంటి
వారు; శాంతమున్న యతుల వంటి వారు 310

# 32. కీడుచేయమి

పరులు మెచ్చు సిరులు బడయ గలిగినను
ఒరుల కప్రియములు నెరపరాదు 311

అలుక నప్రియములనన్యుఁడొకడు చేయ
గొప్ప వారు కీడు కోరు కొనరు 312

కీడొకండు చేయ బదులు కీడొనర్ప
నెంచి నంత మాత్రంబున ఎగ్గు కలుగు 313

ఎగ్గు పరులొనర్ప నెగ్గు నెంచక, వారు
సిగ్గిలంగ మంచి చేయుటొప్పు 314

తనదని పరుల బాధల దలపకున్న
ఎరుకచే గల్గు మేలేమి ఇహము నందు? 315

ఎగ్గని తన మనము నెంచెడు వానిని
పరుల కెంచ కుంట పాడియగును 316

ఎంతయైన నెన్నడయిన ఎవరికైన
ఎగ్గు తలపక యుండిన ఎసగు మేలు 317

తనకు చేటగు నను దాని దలచి యొరుకు
చేయు చుండుటమేలొకో చింత మాని 318

తొలి పగలు పరులకు కీడు దలప నదియె
మలి పగలు మునుకొని వచ్చు మనుజు కడకు 319

కష్టములు కీడు గావింప కలుగు చుండు
సుఖము కోరు వాడు పరుల సుఖము గోరు 320

# 33. అహింస

ధర్మ మే దనిన నహింస, ధర్మరహిత
ములకు యోజింప హింసయే మూల మగును 321

పంచి యిచ్చి, కుడిచి, పలు జీవులను బ్రోవ
స్మృతుల కర్త లవని మెచ్చిన దగు 322

సాటిలేని గుణ మహింస, సత్యవాక్కు
దాని పిదప నెంచబడును ధరణిలోన 323

మంచి మార్గమేదన, హింస నెంచకుండ
మనుట యని ధర్మశాస్త్రము గనిన నిజము 324

జీవగమనమునకు జంకి చెలగు వారి
నడుమ, చంపుటకు వెరచు నరుడు మిన్న 325

చంప జంకు వాని సరస జేరగ లేడు
చంపు వృత్తి గొనిన జముడు కూడ 326

తన యసువులు పోవు తరి కూడ మరియొక
యుసురు దీయ నెంచ డుత్త ముండు 327

హత్య గావింప సంపద లవని యందు
హెచ్చినను ఆర్యుల కదియె హీన మగును 328

హత్య వలని నైచ్యమరయు నార్యజనులు
హంతకుల నీచగుణులుగ నెంతురెపుడు 329

కడు తెవులొడలు, లేమియు గలుగు, పూర్వ
జన్మమున హంతకులయిన జనుల కంద్రు 330

# 34. నిలుకడ లేనివి

స్థిరము కాని వాని స్థిరముగ భావించి
అల్పుడు కడు నైచ్యమవని గనును 331

నాటకమునకు వచ్చెడు నరుల భంగి
యౌను సిరులు వచ్చి చనుట నరసి చూడ 332

దినము కాల ప్రమాణమై జనుల యుసురు
దీయు కరవాల మగుచుండు తెలియగనిన 333

చరమ కాలపు వెక్కిళ్ళు దరిని జేరు
మునుపు, సద్ధర్మముల నెల్ల చేయవలయు 334

సిరులు నిలుకడ లేనివి, చెందినపుడు
స్థిరమయిన ధర్మముల నెల్ల చేయవలయు 335

నిన్నమనినవాడు నేడు లేడని చెప్ప
అస్థిరమగు పేర్మి యాయె భువిని 336

తెలియరొకనాడును బ్రతుకు తెరువు, కోట్ల
కొలదిగ తలపుల నెపుడు తలచుచుంద్రు 337

పంజరంబు వీడిపక్షి చనుట కొప్పు
ఒడలి తోడ నుసురు కొనరు మైత్రి 338

నిదుర బోలు చావు, నిదుర లేచుట యగు
జనన, మరసి చూడ సత్యమిదియె 339

ఒడలిలోన నుసురు కొకమూల నెలకొన
నిలుకడైన గూడు కలుగ లేదొ 340

# 35. సన్యాసము

ఒకడు మనసు దేని నుండి మరల్చునో
దాని వలన బాధ తవుల దెపుడు 341

ఉండు నాడు విడువ వలె నిండు సుఖము
తొలగు దుఃఖములు సిరులు తొరగినపుడు 342

ఇంద్రియ ముల తన్మాత్రల నిల నడచిన
పిదప విడువ వలయు వాని పేర్మినొకట 343

తప మొనర్ప దగును తవసి బంధము వీడి,
పడును మాయ లోన బంధమున్న 344

ఒడలె మిక్కిలి బరువైన ఒందు బంధ
మేల తవసికి? భవధుఃఖములను విడువ 345

నేను నాదను గర్వము నెరయ ద్రుంచ
దేనతలకును మించిన తేజము గను 346

పట్టి విడువవు దుఃఖముల్ బంధములను
పట్టి విడువని వాని నెప్పట్టు నైన 347

అన్ని విడచిన వాడు పేరెన్నిక గను
మరులు వలను పడిన వారు మరియితరులు 348

బంధములను విడువ భవ దుఃఖము తొలగు
లేనిచో నిలుకడ లేమి కలుగు 349

సంగమును కోరవలయు నిస్సంగుని కడ
బంధముల నెల్ల ద్రుంచ నా బంధమగును 350

# 36. తత్త్వమెఱుగుట

సత్తు కాని వాని సత్తని తలచుట
దుఃఖ జన్మమునకు దోహదమ్ము 351

మరులు వదల ముదము గల్గు; మాయ వీడు
దాని వలన నజ్ఞానము తలగిచనును 352

తత్త్వ మెరుగు నపుడు తలగు నందేహము
స్వర్గ మపుడు వాని సరస జేరు 353

ఇంద్రియ సుఖముల నణచ నేమి ఫలము?
తత్త్వ చింతన లేనిచో తవులు మాయ 354

ఏది యెట్టిదైన నెరుగవలయు, వస్తు
తత్త్వ మరసి నిజము ధర్మమదియె 355

కరచి, తత్త్వ మెరుగ గల్గిన వారికి
మరల భవము లేని మంచి కలుగు 356

మనమున నిజ తత్త్వ మెరుగు మానవునికి
తదుపరి భవము లగునని తలపవలదు 357

పుట్టుక యనెడు దైన్యము పోవ శ్రేష్ఠ
మైన పరతత్త్వ మరయగ నదియె తెలివి 358

ప్రాపయిన పరతత్త్వము స్వంధ ముడిగి
కొలువ ప్రావ్య దుఃఖంబులు తొలగిపోవు 359

కామ కోప మోహములను కలిపి యొకట
విడిచినంత దుఃఖంబును విడిచిపోవు 360

# 37. ఆశలను త్యజించుట

ఎల్ల యుసురుల నెల్లప్పు డేమరించి
భవమునం ద్రోయు విత్తయి పరగునాశ 361

వేడిన యెడల పుట్టమి వేడవలయు
కోరమిని కోర నయ్యది తారసిల్లు 362

కోరకుండుట యనునట్టి గొప్ప సిరికి
నెన భువిని లే, దరయగ లే దెందునైన 363

ఆశ లేనిదైన ఆత్మ శుద్ధి యగును
సత్తు నరయగ నది సాధ్యమగును 364

బంధ రహితు లనగ పట్టుడిగిన వారు
బంధము గల వారు పరులు ధరను 365

కామముడిగి బ్రతుక కలుగు ధర్మమిలను
వంచన గొని చెరపు వాంఛ జనుల 366

కోరికల నెల్ల విడిచిన చేరు మంచి
కర్మములు మదికి ముదము కలుగునట్లు 367

కామ మడప, లేవు బాములు;లేనిచో
వెతలు విడువ కుండ వృద్ధి గనును 368

వెతల బెన్వెత కామము న్విడువ జాలు
సంతతానందము మహిని సంఘటిల్లు 369

ఆరని గుణము గల ఆశలడప నది
నిలుకడగు ముదమును నెగడజేయు 370

# పూర్వ కర్మము

## 38. విధి

ఒదవు విధిని కలుగు నుత్సాహము; చెలగు
నలసత సిరి విడుటకైన విధిని 371

కలిమి పోకార్చు విధిని అజ్ఞాన మొదవు;
వచ్చు విధి గల్గ నుజ్ఞాన వంతు డగును 372

శాస్త్ర సూక్ష్మముల నరసి సారమెరిగి
నను, వివేకము ప్రాప్తము ననుసరించు 373

విధివశత లోక మిరు వేరు విధము లగును
చెలగు సిరి కలగుట వేరు తెలివివేరు 374

చెడుగు మంచియు, మంచివి చెడిన వగును
విధివశంబున సిరులను వెదకునపుడు 375

తమవి కానివి తలగును తమ దగుసిరి
విడిచినను పోదు నంప్రాప్తవిధి కతమున 376

విధి విధాన మధిగమంచి నిధులు కోట్లు
కలిగిన ననుభవించుట కల్ల మహిని 377

ప్రాప్త దుఃఖములు విడువ వరితపించు
పేద, సన్యసించు సిరుల పేర్మిలేక 378

సుఖము గలుగగంగ ముదమున చొక్కునరులు
దుఃఖ మబ్బిన కలతల దూల నేల? 379

విధి బలీయ మగును; విడువ మరొకదారి
వెదకి చనిన కూడ నది యెదురగు 380

అర్థవాణి

రాజు

# 39. రాజు గరిమ

సేన, ప్రజ, మంత్రి, దుర్గము, చెలిమి, కోశ
మమర నృపులలో రాజు సింహంబుగ నగు 381

ధైర్య, మీవి, తెలివి, తగిన యుత్సాహము
నాల్గు నివియ రాజు నాణ్యత కగు 382

అప్రమత్తత, దీమన, మలరు విద్య
మూడు గుణములు రేనికి పొనగు సతము 383

ధర్మమును విడక అధర్మ కర్మ మడచి
శూరతాభి మానము రాజు కోర దగును 384

సిరుల గూర్చియు పదిలమ్ము చేసివాని
బంచి యిడ దగిన దగును ప్రభుత మహిని 385

చూడ సులభుడై పరుషము రేడు పలుక
డేని కొండాడు జగతి ఆ రేని నెపుడు 386

మంచి మాటల మాన్యుల నెంచి ప్రోచు
భూపతికి కీర్తి విలసిల్లు భూమి యమరు 387

న్యాయ పాలనతో ప్రజ నయము నెరిగి
ప్రోవు రాజు దేవుడనగ, పొందు కీర్తి 388

కొరలను విని ఓర్పు గొను రాజు ఛత్రము
క్రింద నిలుచు జగతి కీర్తి గాంచు 389

దయయు నీవియు పాలనా దక్షతద జన
రక్ష జేయ దీపింతురు రాజులెల్ల 390

## 40. విద్య

కరవ వలయు నిశ్చయముగ కరవ దగిన
వాని గరచి నెరి విడక వరల వలయు 391

అక్షర గణిత జ్ఞానము లనెడు రెండు
కన్ను లగు నంద్రుు ధరణిపై నెన్న గాను 392

కరచిన జను లవని కన్నులు గల వారు
ఒండు జనుల కవియె రెండు పుండ్లు 393

కూడి యుండ ముదము వీడిన దుఃఖము
కలుగ జేయు వారు కరచు వారు 394

కలిమి ముందు లేమి నిలుచు పోల్కి చదువ
వలయు విద్య నెరుగు వాని మ్రోల 395

ఇసుక తోడినంత నెసగు నీరు వగిది
చదివి నంత గలుగు జ్ఞాన మవని 396

పండితునకు భువిని పరదేశమని లేదు
చచ్చు వరకు జనులు చదువరేమి? 397

విద్య యొక జన్మ గరచిన వెలయు ఫలము
జన్మ లేడింటి యందును సాగుచుండు 398

తమకు ముదము గూర్చు చదువు ధరణికగుట
గాంచి సుజ్ఞానులు మరియు కరవ నెంత్రు 399

చేటు లేని మేటి సిరి విద్యయే యగు
తరుగు సిరులు ధరణి తదితరములు 400

# 41. అవిద్య

గడులు లేక ఆడ కాయ లిడుట యగు
చదువు లేక సభను చని పలుకుట 401

చదువక చదువరుల కడ చని పలుకుట
కుచరహిత యైన స్త్రీ ప్రేమ కోరుట యగు 402

నేరువని వారు కడుమంచి వారె; బుధుల
ముందు నోరెత్త కుండగ నుందు రేని 403

కరవ కొకడు తెలివి కలిగి యుండిన కూడ
జ్ఞాని దాని గనడు జ్ఞాన మనగ 404

అజ్ఞ డాత్మ గౌరవమున నలవి గనక
కోవిదుని కడ మాటాడ కొరత వడును 405

కలరు భువిననుటయె కాని చదువ కుండు
వారు చవిటి నేల వంటి వారు 406

సూక్ష్మముగ వివేచించెడి సొబగు లేని
వాడు మట్టి గూర్చిన బొమ్మ వంటివాడు 407

అజ్ఞులొందు సిరులె అధిక దుఃఖ మొసగు
బుధులు లేమి వలన పొందు కంటె 408

గొప్ప కులము వాడైనను కులము హీన
మైన చదులవరి ముందు తా నాగ లేడు 409

విద్య గరచిన వారితో విద్యలేని
వాని బోల్చ నేర్వని వాడు వట్టి మృగము 410

## 42. వినికి

సిరులలో శ్రవణం బను సిరియు నొకటి
అదియె సంపద లన్నింటి నధిక తరము 411

చెవికి వినికి విందు చెందనపుడు మేని
కోగిరంబు కొంచె మొనగ వలయు 412

చెవికి విందగు వినుకలి సిరి గలిగిన
జనులు హావిగొను సురలకు సము లగుదురు 413

చదువ కున్నను వినదగు చదువరులను
గొలిచి, యదియె యూతగ నుండు కలత లందు 414

కాలుజారు చోట కోలవలె నమరు
శీల వంతు నుడులు జీవితమున 415

ఎంత కొలదియైన నెరుగ వలయు మంచి
యెరిగి నంత వరకు నెనగు పేర్మి 416

వినికి తెలివి యెక్కువయిన విజ్ఞులవని
పొరపడిన కూడ నుడువరు పొల్లు మాట 417

వినికిచే చిల్లులు వడని వీను లితర
శబ్దములు విన్ననె చెవుడు చాల గలుగు 418

సూక్ష్మముగ వినని జనులు శుభము గూర్చు
నుడువులే వేళ నైనను నుడువ లేరు 419

చెవిచవుల వీడి వాతిండి చవుల గనెడు
మనుజుడిల చావు గననేమి? మనిననేమి? 420

# 43. ఎరుక

చెరుపు నుండు కాచి నెరుక, పగతులను
చెరువ లేని దుర్గ మెరుగ నెరుక 421

మనము వరివరి విధముల మసలనీక
సత్ఫలముల నరయునదె జ్ఞాన మగును 422

ఏ విషయ మెవరెవ రెట్లెట్లు చెప్పిన
నవ్విషయము సత్యమరయ నెరుక 423

అర్థమగునట్లు నుడువుట యర్థ సూక్ష్మ
మరయు నట్లు గ్రహించుట అదియె యెరుక 424

విజ్ఞులు చెలిమి నొంద వివేక మగును
సంతసము దుఃఖములు లేమి జ్ఞాన మగును 425

జగతి కనుగుణముగ సంచరించి, యెరిగి
ఉచితరీతి నడువ నొదవు నెరుక 426

జరుగ బోవు వాని జ్ఞాను లెరుగుదురు
అరయ లేరు వాని నజ్ఞు లెప్పుడు 427

ఓడ దగిన వాని కోడ డల్పజ్ఞుడు
ఓడ దగిన వాని కోడు జ్ఞాని 428

జరుగ బోవు వాని నెరుగు విజ్ఞుల, కిల
కవితల బడు టెపుడు గలుగ బోదు 429

అన్ని సంపద లున్నను నజ్ఞుడైన
లేనివాడు; విజ్ఞుడు లేమి లేని వాడు 430

## 44. దోషములను పరిహరించుట

గర్వకోపకామములను గనని వాడు
పొందు పెంపున్నతంబగు పుడమి మీద 431

ఇవ్వకుంట, నయము గాని యెలమి, మోహ
మవని నృపతికి దోషము లగుచు నుండు 432

దోషమావంత యైనను దోచు తాడి
యంత, నిందకు భయమందు నార్యుల కిల 433

దోషము పతన మిదు వగ తొలగ జేయ
వలయు దాన దోషము లేక వరల వలయు 434

అగ్ని ముందున్న గడ్డిగా నగును, తప్పు
తెలియ దలపని వారితో పొలుచు బ్రతుకు 435

మొదట తన దోషముల నీగి పిదప వరుల
దోష మరయు నాయకునకు దోషమేది? 436

చేయ దగిన వాని చేయక నంవద
కూడ బెట్టు చెడును కొలది మీర 437

సిరుల మీది మక్కువ లోభి జేయు,మనుజు
దోషముల నెన్ననది పెద్ద దోషమగును 438

గొప్ప దలచ రాదు తనను గూర్చి, నిరుప
యోగ మెన్న రాదు మదిని నూహ జేసి 439

కామితముల దెలియ నీక కలిగి యనుభ
వించు వానిని శత్రువుల్ మించలేరు 440

# 45. పెద్దల చెలిమి

ధర్మబద్ధుల, జ్ఞానుల దలచి చెలిమి
నాశ్రయించెడి మార్గము నరయ వలయు 441

ఉన్న వంతల పోగొట్టి యొందు రాక
గాచు ధీమంతుల చెలిమి గాంచవలయు 442

పెద్దల తమ వారుగ జేయ దెలియ నదియె
అరిది యగు నంపదల లోన నరిదియగును 443

తమకు పెద్దల హితులుగ నమరజేసి
కొనుట బలములలోకెల్ల గొప్ప బలము 444

తగినవి నుడువు పెద్దల ధర కనులని
తలచు,నృపతి కగును వారి చెలిమి చేయ 445

తగిన పెద్దలకు నడుమ నొగి నడువగ
పగరు చేయు నెగ్గు లవని పాడు వడును 446

హితము నొక్కి నుడువు హితులుగల నృపతి
జెరప దలచు వారు చెలగగలరె? 447

మంగలించు హితుల తోడు పొందడేని
పగరు లేకయే నరపతి పతన మగును 448

మొదలు లేక లాభములు లేవు, తగుతోడు
గొనని నరులు భువిని కుదురు గనరు 449

పెద్దల చెలిమి వీడుట పెక్కు పగర
కీడునకు మించి పదిరెట్లు కీడొనర్చు 450

# 46. అల్పులను పరిహరించుట

అల్పుల నెడయ నెంచుట యార్యుల మత
మల్పులకు వారి బొందుట యభిమతమగు 451

నీరు తాను జేరు నేల ననుసరించు;
మైత్రిననుసరించు మనుజు నెరుక 452

మనజు సహజమగు తెలివి మననున నగు
పాత్రతత గణింప చెలిమిచే బయట పడును 453

తెలివి మనసు నందున్నట్లు తెలియుగాని
ఒకని చెలిమి ననుసరించి యుండు నదియె 454

మానసిక శుద్ధి, చేతలమనెడు శుద్ధి
చెలిమి శుద్ధి ననుసరించి చెలగు చుండు 455

మానసిక శుద్ధి గలిగిన మలయు కీర్తి
చెలిమి శుద్ధి వలన మేళ్లు కలుగుచుండు 456

ఉనురునకు, మదిమేలిమి నొనగు పెంపు
చెలిమి మేలిమి కీర్తుల చెంత చేర్చు 457

మనలు మేలిమి దృఢముగ గనినను మహి
చెలిమి మేలిమి కావగు చేవ మీర 458

మంచిమనసుగలుగ మరుమేన సుఖమగు
మంచి వారి చెలిమి మించు దాని 459

మంచి చెలిమి కంటె మించు తోడిల లేదు
చెడ్డ చెలిమి కంటె చేటు లేదు 460

## 47. తెలిసి చేయుట

పోవునదియు, నగునదియు పొందు ఫలిత
ములను నరసి కార్యములను నలువ దగును 461

ఎరుగు వారి తోడ నెరిగి తాము నరసి
పనులు చేయ సాధ్యపడని వేవి? 462

పిదవ లాభమును గణించి మొదలు విడుచు
చెయిదములను వివేకులు చేయరెపుడు 463

నిందకు వెరచు నుజనులు నిశ్చయముగ
తేట పడని పనుల జేయ తివురరెపుడు 464

కార్యవిధముల నరయక కడగి చేయ
నదియె పగతులు వృద్ధికి ఆదర మగు 465

చేయదగని పనుల జేయ చెడును, తగిన
పనుల చేయకుండిన కూడ పతన మగును 466

చేయదగున వాని నరసి చేయదగును
కడగి యా మీద నరయుట కాదు హితము 467

తగు విధ మరయక పనులు తలవడనవి
పలువురను తోడుగొనినను పాడు వడును 468

మనుజుల గుణము లెరుగక మంచిపనులు
చేయ యత్నించినను తప్పు చెందు ధరణి 469

ఒప్పని పనులు చేయంగ నొల్ల దుర్వి
పూని చేయ వలయు నంగ్గు కాని వాని 470

# 48. బలము నెరుగుట

పనిబలిమి, తనబలిమిని, పగతు బలిమి
నిరువురికి తోడగు బలిమి నెరుగ వలయు 471

ఉచిత కార్యము, దానికై యొదవు నెరుక
గలిగి తిరముగ యత్నింవ కానిదేమి? 472

బల మెరుంగక యత్నించి పనులు చేయ
కడగిన ముగింప నేరక కలతల బడు 473

పరుల ననుసరింపక తన బలమెరుగక
నలవి గనక నున్నతముగ తలవ చెడును 474

నెమలి పింఛము లైనను నిక్కి యలవి
నెంచక శకటమున నిడ నిరుసు విరుగు 475

కొమ్మకొన నెక్కిన నరుడు కోరి దాని
మీది కెక్క నుంకించిన మృత్యువు గను 476

తగిన విధి నలవి యెరిగి దాన మిడిన
కలుగు సంపదల కదియె కాచు తెరువు 477

రాబడి తరిగినను, రాదు కీడధిక వ్య
యంబు చేయకున్న నతనికెవుడు 478

సిరి మితి నెరుగకయ జీవించు వారికి
అది కలిగియు లేని దగును తుదకు 479

ఉన్న సిరుల నెరుంగక ఒరుల కీడగ
సన్నగిల్లుచు, త్వరపడి చనును వీడి 480

# 49. కాలము నెరుగుట

పవను గెల్చు ఘూకము గాకి; పగతు దునుమ
తగిన సమయమెరుగ వలె ధరణి నృపతి 481

కాల మనునరించి యరయ గలుగు నడత,
కదలెడు సిరిని త్రాటితో గట్టుట యగు 482

అరిది పనులును గలవొకో!అగు సమయము
నెరిగి తగు నుపకరణము నెంచి చేయ 483

స్థలము, కాలము తగినవి కలుగ నవని
నెల్ల నవలీలగ జయించి యేల నగును 484

భువి జయింప నెంచు జనులు పూని వేచి
యుందురు తగిన తరుణము నొందు వరకు 485

అరిని దాకగ పొట్టేలు అడుగు వెన్క
కిడుట యగు నూకువ గల వాడడగుటయన 486

కోపము వెలిజూపక వివేకులు సమయము
నరసి వేచి యుల్లంబున నలుక గొంద్రు 487

పగర జూచిన నోర్పున నెగడ వలయు
చేటు దాపురించిన వారి శిరము తెగును 488

అరిదియగు నదను పొసగ, నరిది పనుల
నపుడు చేయవలయు పూని, అలరునట్లు 489

కొక్కెర వలె సమయమును కోరి, మీను
నది పొడుచు విధముగ చేయ దగును పనుల 490

# 50. చోటు నెరుగుట

తొడగుట, అరుల దెగడుట విడువ వలయు
అనుగుణమగు చోటును కను నంత వరకు 491

బలయుతులకైన, కోటతో గెలుపు గలుగ
పెక్కు లాభంబు లద్దాన దక్కునపుడు 492

బల విహీనుడు బలవంతు గెలువ జాలు;
స్థల మెరిగికాచి, పగతుర దాక గనిన 493

ఎడ మెరిగి తగురీతిని నడచిన యెడ
పగతురు జయింపలేమని భయము గొంద్రు 494

లోతుగల నీట మకరంబు లాతివారి
గెలుచు;బయలున నితరము గెలుచుదాని 495

కడలి నేగు నోడ నడవ జాలదు నేల
నేల మీది రథము నీట బోదు 496

కొరతలేక తగునెలవు గొని యొనర్ప
జంకమియె తప్ప మరియొక సాయమేల? 497

చిన్న సేన కలిగినను చేరు నెడము
తగిన దైన, పెనుబలము తలగి చనును 498

కోట వంటి బలంబులు కొరవడినను
అరినతని చోటనె గెలుచు టరిది యగును 499

ఈ టెగాంద్ర గూల్చెడు కొమ్ము టేనుగు లవి
నక్కచే మాయు నడునున చిక్కినపుడు 500

# 51. తెలిసి చేయుం

ధర్మ, మర్థము, కామము, తన యనువుల
కడలు గుణమరసి యెరుగ నగు నొకరుని 501

దోషరహితు, కులీనుని, దొనగు చేయ
సిగ్గిలు జను నెరిగి వాని జేర దగును 502

అరిది పొత్తముల పఠించి యనఘు లయిన
వారి కడను నజ్ఞానము వరలుచుండు 503

గుణము లెరిగి, కోపమరసి కొదవ లెరిగి
మిగిలినవి తలచి యెరుగ దగు నొకనిని 504

పెరిమెను, పతనమున నొరగల్లుగానుండు
తమ తమ చెయిదములె ధరణి యందు 505

బంధురహితు, నమ్మ దగదు; పట్టులేని
వారు కాన నిందకు జంకు వారుకారు 506

తెలియదగు వాని తెలియమి, తెలివి లేని
వాని గాదిలి నమ్మిన వంతల బడు 507

నయ మరయక నొకని నమ్మిన నది వాని,
వాని కులమునకును వంత గూర్చు 508

అరయకొకని నమ్మదగదు; అతని నరసి
తెలియదగు వానిని తెలిసి లేరవలయు 509

అరయకొకని నమ్మిన, యరసి పిదవ
నమ్మకుండిన తీరని నష్టమొనగు 510

# 52. ఎరిగి కార్యమునకు పూనుట

మంచి చెడులను పరికించి మంచి వాని
నిష్టపడెడు వాడర్హుండై యిలను పొలుచు 511

వనరుల, సిరుల పెంచియు వచ్చు నాప
దలనెరుగు వాడు పనులకు తగిన వాడు 512

నెన, రెరుక, యాశ లేకుంట నిరుకు గనెడు
చేవ దిరమైన వానిని చెందదగును 513

ఏ విధి నరసి తేరిన నిడిన పనుల
పట్ల వేరగు వారిల పలువురుంద్రు 514

అను వెరిగి యెడము లడచి పనుల జేయు
మనుజులను తప్ప పరులను పనుపరాదు 515

చేయువాని ప్రతిభ జూచి చేయదగిన
పని నరసి, సమయమరసి పనుప వలెను 516

ఈత డిద్దాని దీనిచే నెసగి చేయు
నని తెలిసి యాపని కతని ననుప వలెను 517

పని కొకని యోగ్యత నరసి వెనుక నతని
దాని కర్హునిగా జేయ తలప వలయు 518

చేకొను పని సక్రమముగ చేయువాని
సంశయించిన నాయకు సంపద చెడు 519

కర్మరుడు చెడని వరకు కలగి చెడదు
జగము, రేడెపుడు నరయ దగును వాని 520

## 53. అతిథుల ఆదరణ

లేమి పొందినను నొకని నోమి పూర్వ
బంధమును గొప్పగా నెంత్రు బంధువు లిల 521

ప్రేమ తొలగని చుట్టము పిరుద నుండు
నతనికి నదిపెను సిరుల నమర జేయు 522

బంధువుల గూడి ప్రేమతో పలుకడేని
బ్రతుకు చెరువొడ్డు లేనియా పగిదియగును 523

చుట్టముల జుట్టబడి నెమ్మి చొరవ గలిగి
మనెడు వాని సిరి, ఫలము గనిన దగును 524

ఇచ్చుటయు నెమ్మినుడువుట ఇలను జేయు
నతడు బంధువులను గూడి అలరు చుండు 525

దాతగను శాంతుడుగ నున్న ధర్మపరుని
కంటె చుట్టముల నొరులు గాన లేరు 526

కాకి యెరను దాచక తెగ నేక మగుచు
తిను, నురుగుణము గల వాడు తిగియునట్లు 527

అందర నొకరీతి గనక యసి ప్రతిభ
కనువుగ నృపతి గాంచిన, కనును హితము 528

చనిన చుట్టముల్, హేతువు నమయు పిదవ
తమకు తాముగ వత్తురు తగవు వీడి 529

తనను విడిచి, కార్యము నెంచి తనను జేరు
నతని నరసి నృపతి గూర్ప నగును హితము 530

# 54. మరపు లేకుండుట

అధిక సంతోషము వలన నైన మరపు,
కలగు నధికమౌ కోపము కంటె కీడు 531

అనుదినము లేమి పెనుగొన నజ్ఞజేయు
మనుజు; నత్కీర్తి చెడిపోవు మరపు వలన 532

మరచు వారికి కలుగదు మంచికీర్తి
శాస్త్రకారు లందరు దాని చాటుచుండ్రు 533

భయపడిన, దుర్గమున్నను ఫలములేదు
మరపు వలన మంచియనుట మానునట్లు 534

మును పె, వచ్చు చెడుల గాచి కొనని వాడు
వచ్చినపుడు లోపము లెన్ని వగచుచుండు 535

ఎవరి యెడనైన నెపుడైన ఏర్పు మరపు
కలుగ కున్న లేదిల దాని కంటె మేలు 536

మరపులేమి యనెడు పరికరము చేత
బూనిన నసాధ్యమన లేదు పుడమి లోన 537

పొగడదగు పనులను జేయ పూన వలయు,
మరవ, మేలేడు జన్మల మరలి పోవు 538

సంబరమున, గర్వము గొన స్మరణ జేయ
వలయు పూర్వమెట్లు చెడిన వారినపుడు 539

తలపులను వదలక జ్ఞప్తి దాల్చియున్న
తలచినవి పొంద నగు తాను తలచినట్లు 540

## 55. దండనీతి

తప్పు నరసి కనికరంబు తలపకుండ
మధ్యవర్తియై పరికించి మనుట నీతి 541

ఎల్లజీవులు వానకై ఎదురు జూచు
నీతి కొరకు ప్రజలెపుడు నృపతి నెంత్రు 542

విప్రులు పొగడు వేదము, వినుత ధర్మ
మరసి పాలింప భూపతి కగును నీతి 543

దండమునయముగ నెరపు ధరణిపతికి
చెందు నేల, వర్షము పంట నొందు నొకట 544

ప్రజల నెమ్మి జూచి పాలించు భూపతి
పదము జేరి నిలిచి పరగు జగము 545

జయము నిడదీటె, దండము జయము నిచ్చు,
నదియు నీతిదప్పకయుండు నధిపు కతన 546

నేతగాచు భువిని, నిరత మాతనిగాచు
పాడి దప్పని నిజ పాలనంబు 547

నీతి నరయక చేయు నా నేత యధమ
పదము గాంచి తనకు దాన పతన మగును 548

ప్రజలగాచి తానును బ్రోచి ప్రల్లదముల
దండన నడప కొరగాదు ధరణి పతికి 549

మరణ శిక్షచే క్రూరుల మాపదగును
కలుపు దీయుట యగు నది పొలము నందు 550

# 56. వక్రదండము

ప్రజల బాధించి యవినీతి ప్రబల జేయు
పాలకుడు హంతకుల కంటె పాపి యగును 551

దండమును దాల్చు నరపతి దండుకొనుట
దొంగ త్రోవ బల్లెము జూపి దోచుట యగు 552

మంచి చెడ్డలను దినము నెంచని పతి
నెగడు రాజ్యమనుదినము నీరసించు 553

ఒడయుడు నిరంకుశుండైన నొల్లరు జను
లరిదియై పోవు సంపద లవని యందు 554

సిరుల తరుగ జేసెడు సేన నరయ, నృపతి
గాసివెట్ట, దొరలు ప్రజ కంటి నీరు 555

దండ నీతి వలన మెండగు పతికీర్తి
నిలువ బోదుకీర్తి నీతి విడువ 556

వాన లేని భూమి వరలు టెట్లో, రాజు
కరుణ లేని జనులు కలగు టట్లు 557

నెరిదొరంగి పాలించెడు నృపతి రాజ్య
మందు లేమి కంటె కలిమి నొందు కీడు 558

క్రమ మెరుంగని నరపతి కాల మందు
జలదములు క్రమ మెరుగక సాగు చుండు 559

ఆగమముల మరచు ద్విజు, డా వొనగదు
పాలు, నెరిదప్పిన నృపతి పాలనగని 560

# 57. భయపెట్టకుండుట

నేర మరసి, మరలనది నేరకుండ
తగిన దండన మొసగగ దగును నృపతి 561

కలిమి నిలువ గోరు నృపతి కఠిన శిక్ష
లొసగక యుచిత దండన లొసగ వలెను 562

వెరపు గొలుపు కృత్యంబులు విభు డొనర్ప
చెలగి నట్లనిపించుచు చెడును వేగ 563

దుష్టడని నింద జనులకు తోచునట్లు
నడచు రాజాయువు ముగిసి చెడును జగతి 564

ప్రజల మొర వినక విముఖ వదనుడైన
రాజు సంపదలు పిశాచి రక్షణ బడు 565

కడిదినుడి, నిర్దయ నృపతి కలిగియున్న
కలిమి చిరకాలము మనక తొలగి పోవు 566

క్రమము దప్పిన పాలన కఠిన దండ
మరయ బలము నరగదీయు ఆకురాయి 567

పరిచరుల కడ నరయక పాలితులను
కినుక జూచు రాజు సిరులు కీడు నొందు 568

అప్రమత్తుడై దుర్గము లమర జేయ
కున్న సమర రంగంబున నోడి చెడును 569

నేర్వని జనుల మెండుగ నించు కఠిన
దండి; బరువిల కంతకు నొండు లేదు 570

# 58. దాక్షిణ్యము

అందమొనగెడు దాక్షిణ్య మలరు కతన
నిలిచియున్న దీ లోకము నేటి వరకు 571

సాగు [illegible] దాక్షిణ్యము సాగుకతన
బ్రతికి ఫలమేమి? యదిలేక బరువు గాక 572

రాగమేల పాటకు తగు రక్తిలేక
కన్నులేల దాక్షిణ్యము కలుగకున్న 573

కనులు కలదనుటయె గాక కలుగు ఫలిత
మేమి? దాక్షిణ్య మద్దాన నెనగకున్న? 574

కంటికి నగ దాక్షిణ్యము కలిగియుంట
కానిచో వ్రణమని యెంచి కనుట మేలు 575

కనులు గలిగి దాక్షిణ్యము గనని వారు
కణుపులున్న వృక్షము భంగి క్రాలువారు 576

కనులు గలవారు దాక్షిణ్యమున వరలెడు
వారు లేని వారు కనుల తేర రెపుడు 577

తగిన మొగమోటము గలిగి తమతమ వను
లాచరించు వారికి సొంత మగును జగము 578

దండన కగు వాని దాక్షిణ్యమున జూచి
ఓర్పుగుణము, నరయ నుత్త మంబు 579

పలువు రిచ్చగించు దయను బడయ నెంచు
వారు విషము నైనను దగు నారగింప 580

# 59. చారుల నేలుట

చారతయు, నీతిశాస్త్రము గోరవలెను
రెండు కనులని భావించి రేడు భువిని 581

అందరికి నన్నివేళల నగున వెల్ల
వేగ దెలిసి కొనుట రాజు వృత్తి యగును 582

చారుల వలన దెలిసిన వివర మరయ
డేని రేడు గెలుచు మార్గ మేది ధరను 583

బంధువుల, పనివారిని, పగతు లనెడు
నందరిని నరయు నతడె యగును వేగు 584

సంశయమర రూపు గొనుట జంకు గొనమి,
గుట్టు తెలువమి గలవాడె గొప్ప వేగు 585

యతి వలె నిలిచి దుర్గమ మగు నెలవుల
వెడలి, ఓర్చుకొను నతడె వేగు చూడ 586

మరుగు పడిన వార్తల నెల్ల మహిని పృచ్ఛ
జేసి యెరిగి సంశయమర జెలగు వేగు 587

వేగొకడు దాగి యెరిగిన విషయమునొక
వేగు నడిగి పోల్చితెలియ విభు డలరెడు 588

ఒకని కొకని తెలియనీక నొక వివరము
ముపుర నడిగి పోల్చిన నిజము విభుడెరుగు 589

పరు లెరుంగ చారులకును బహుమతి నిడ
రాదది రహస్యమును బహిరంగ పరచు 590

# 60. ఉత్సాహము

కలిమియన నూకువ కలిమి కలిమి యెంత
కలిగియున్నను నదిలేమి కలుగు టగునె? 591

ఉల్లమున నూకువ గలుగ నొడమి, పరము
సంపద లనగ నేరదు; చంచలములు 592

ఊకువయను కలిమి గల్గు నొకడు సిరులు
తరిగెనని కలతం బొంది తన రడెవుడు 593

ఊకువ గల వారి దరిని నొదిగి చేరు;
సిరులు తామె తెన్నడుగుచు ధరణి మీద 594

జలము గలిగి నంతె జలజంపు తొడిమయు
ఊకువ కొలది ప్రజ కొడమి కలుగు 595

ఉన్నతి దలవ దగు నొనర కున్నను గాని
తలపు నుండి యెపుడు తలగ రాదు 596

అమ్ముల జదియ బడినను నలరెడు కరి;
కలగ రూకువ గలవారు కలతలందు 597

పుడమి నుత్సాహ హీనులు పోడిమిగల
వారల మని ముదము గొని వరల లేరు 598

నిడివి మేను, దంష్ట్రంబులు నెలకొని కరి
యున్న, నూకువ గొనుపులి కోడిపారు 599

తగిన యూకువ బల, మది, తరుగ, జనులు
నరుల రూపము దాల్చిన తరువులె యిల 600

# 61. అలసత లేకుండుట

తన కులీనత యను దివ్వె తన యలసత
యనెడు మసి సోక నురుకాంతు లడగి పోవు 601

కులము వందనీయంబుగ కొలుచు భవ్యు
లలసత కలసత నొనగి అడవ వలయు 602

చెడు నలసత గల జనులు చెలగు కులము;
చెడి మడియువారి యెదుటనె చేవ తొరగి 603

అలసత బడి యత్నము లేక నలయు వారి
కులము మర్యాద గోల్పోయి కొరత పెరుగు 604

అలసత,మరపు నిద్ర జాగనెడు నాల్గు
పతనమును కోరు జను లేగు పడవ లగును 605

పుడమివతి తానయి చెలిమి పొంద గోరి
నను నలసత గలుగు వారు నయము గనరు 606

యత్నలోప మలసతయు నందు వారు
నింద గందురు జనులచే నిక్కముగను 607

అలసత కులీను జెందిన నదియె వాని
శత్రువులకు బానిన జేసి సత్కరించు 608

అలసత నడచు నాతని వలన నతని
కులమునకు, మగటిమి కగు కొరత తొలగు 609

విష్ణుపదములు గొల్చిన విశ్వమంత
నేలగలడు రాజలసత నేల కున్న 610

# 62. పురుష యత్నము

అరిది యని నొక పని నెంచి తొరగ రాదు
యత్నము వలన పెరిమెయు నడరు చుండు 611

పనుల లోపము గావింప పరిహాసించు
జగము; లోప మెంచగ రాదు జతన మందు 612

పరుల కొదవుట యను మేల్మి పడయనగును
యత్నమను నుత్తమ గుణము నలవరచిన 613

యత్నహీనుని ఉపకార మనగ, పేడి
చేతి కరవాలము పగిది చెడిన దగును 614

సుఖము గోరక పనులను సొంపు మీర
కడగు వాడు బంధుల కూత కంబ మగును 615

యత్నము సిరి నొనగు యత్నము లేనిచో
వెతల గుడుపులేమి వేగ చేరు 616

అలనత మనల పెద్దమ్మ నిలిచియుండు
చేరు పద్మజ యలనత చెందకున్న 617

నెగడు విధి వక్రత గనుట నిందకాదు
యత్నలోపము గల్గుటే యగును నింద 618

దైవఘటన వలన పని తగ చెడినను
మేని నలయింప నగు కూలియైన దొరకు 619

అలనతయు, యత్న లోపము నడలకున్న
విధిని సైతము వెరపించి విజయము కను 620

# 63. కష్టముల కోర్పుట

కష్టమొందు నపుడు కాంచి నగ వలయు
నదియె దాని గెల్చు నాయుధంబు 621

వెల్లువ వలె వడలు దుఃఖ ముల్ల మందు
విజ్ఞుడెరిగి యరయ నది వేగ చెడును 622

కష్టమున కలత బడక కష్టమునకు
కష్టమును కలిగించిన కలుగు జయము 623

అడ్డు తగిలిన నెద్దీడ్చు నట్లు, యత్న
మెడతెగనిచో నిడుమలకు నిడుమ కలుగు 624

విడువక కలత లెసగిన తడబడ కొగి
నిలుచు వానికి కలతలు కలత గనును 625

కలిగి నప్పడు లోభంబుకనని వారు
సిరి చనినిపుడు వగతురా? చిరు తనముగ 626

మేని కిడుమ లగు ననుచు మెలగు వారు
కలత జెంద బో రిడుమలు కలుగునపుడు 627

ఇమ్ము కోరక దుఃఖము క్రమ్ముట సహ
జమని చేరి మనెడు వారు జంకు గొనరు 628

ముదము గలిగిన నందుకు మురిసి పోని
వాడు కలతలు రేగిన వగవ డెపుడు 629

ఇమ్ము గానివాని నింపుగ భావింప
వగతురైన వాని పొగడు చుంద్రు 630

## అంగములు

# 64. మంత్రి

పరికరము, తగు సమయము, వెరవు, నరిది
యగు పని నొనర జేయు వా డగును మంత్రి 631

జంకమి, కులీనత, యెరుక, జతనము, మరి
విజ్ఞత యను నైదు బడసి వెలయు మంత్రి 632

వేరు చేయుట, ప్రోచుట విడిన వారి
గూడదీయుట, మంత్రికి గుణము లగును 633

తెలియుటయు, తేరి చేయుట ధృతి వహించి
చెప్పుట, సమర్ధుడై మంత్రి చెలగు చుండు 634

నెరినెరిగి, యరసి నుడివి, నిత్యము పని
గనెడు నిపుణుడు మంతనమునకు తోడు 635

సహజ సూక్ష్మ బుద్ధి, శాస్త్ర పరిచయము
కలుగ; సూక్ష్మమేది నిలుచు ముందు? 636

శాస్త్రపరిచయ మున్నను జగతి గమన
మెరిగి యాచరింప వలయు నెల్ల పనుల 637

ధీయుతుండగు శత్రుని తెలియ లేని
పతికి తిరముగ చెప్పెడు హితుడు మంత్రి 638

కీడు నెంచెడు మంత్రిని వీడి నిలువ
పగరు డెబ్బది కోట్లున్న పడయు సుఖము 639

ప్రతిభ లేని వా డరసియు పనులు తొడగి
నపుడు లోపముల నొనర్చి యలమటించు 640

# 65. వాక్పటిమ

పలుకనున దొక సంపద పావన మది
దాని కెన యగు సంపద ధరణి లేదు 641

పెంపు, పతనము, పలుకుచే పెరుగు కతన
మాట పొరబాటు లేకుండ మనల వలయు 642

వినిన వారి వశపరచి వినని వారి
వశము గొని వేడ్క గలిగించు వాక్పటిమము 643

పలుకు బలము నెరిగి పల్క వలయు, దాని
కంటె ధర్మార్థములు ధర కానరావు 644

పలుకవలె, పల్కు మరి యొండు పల్కు దాని
గెలువ జాలని మంచిది పలుకవలయు 645

పరవశము గన తామాడి పరుల మాట
ఫలమెరుగుట లక్షణమగు భవ్యుల కిల 646

వాక్పటిమ, అనలసతయు వరలు ధీర
గుణుని కపటమున గెలుపుగొనుట యరిది 647

పలుకులను గూర్చి, ప్రియముగ పలుకు వాని
యాజ్ఞను జగము పాటించు నడ్డు లేక 648

కొలదీ పలుకులు ప్రియముగ పలుకువాని
వారు పెక్కు పలుకులాడ కోరుకొంద్రు 649

విరిసియు సువాసన లిడని విరులవంటి
వారు నేర్చియు పలుకక వరలు వారు 650

# 66. క్రియాశుద్ధి

మంచి తోడ్డొసగు సిరుల, మంచి పనులు
చేయ నిష్టముల్ సమకూరు స్థిరముగాను 651

యశము ధర్మమొనరదేని యట్టి క్రియను
మనుజుడెప్పుడొనర్పక మానదగును 652

వృద్ధి గాంచవలెనన్న విడువవలయు
యశమునకు కళంకము దెచ్చునట్టి పనుల 653

కష్టముల బడినను నీచకార్యములను
సలుప నెంచరు నిర్మలచతురమతులు 654

చింత కూర్చుపనులు చేయ రాదటుచేసి
నను మరెపుడు చేయమి నయ మగును 655

ఆకలి గొని తల్లి యడలినను బుధులు
నింద దెచ్చు పనులు నెరప రాదు 656

నిందల బడి సిరులు పొందుట కంటెను
లేమి తోడ కీర్తి నోమ మేలు 657

కాని వని యెంచి విడిచిన కార్యములను
పూని చేసి ముగించిన పొందు వంత 658

వెతలు పెట్టి కూర్చిన సిరి వెతను గొల్పి
చను, సదార్జన ఇచ్చును సత్ఫలితము 659

అక్రమార్జన రక్షణం బనుట పచ్చి
కడవలోన నీటిని గొని కాచుట యగు 660

# 67. కార్యస్థైర్యము

పనిదిట వన నొకని మనసు దిటవు, మరి
తదితరము లయినవి తలవ వేరు 661

అడ్డు నడచుట, వచ్చిన నడలమి యను
రెండు లక్ష్యములై యలరెడు బుధులకు 662

కడను చెప్పుట మగటిమి, కార్యమధ్య
మున తెలిపినచో నది దుఃఖము కలిగించు 663

చెప్పు టేరికిన్ సులభము చెప్పినట్లు
కార్య మాచరించుట యన కష్టమగును 664

ప్రతిభచే పేర్మిగనువారి పనిదిటవన
నధిపుచే గౌరవంబును నందికొనును 665

ఎన్నినవియెల్ల నెన్ని నట్లెయిద గలరు
కార్యములను దిటవుతోడ గాంచువారు 666

రూపముగని యల్పుండని రోయవలదు
తేరిరునునందు గల మేకు దృఢతరమగు 667

కలగక, యరసి, పూనియు కనిన కార్య
మందలసత లేక పనికి నమరవలయు 668

సంతస మొసగు కార్యము సలుపునపుడు
కష్టమైనను తుదముట్ట కానవలయు 669

ఎట్టి దృఢచిత్తమున్నను దిట్టతనము
పనిని చూపకున్న జగము పరిహాసించు 670

# 68. పనిచేయు విధానము

చింతనకు మేర తెగువయె చెందు పిదప
అలసతను పని దొడగుట యగును కీడు 671

తడయ జేయు వనికి తడయవలెను, కాని
వాని జేయ వలయు వడివడిగను 672

చెల్లుచోట జేయుట మిన్న, చెల్లనియెడ
చెల్లుచోటు జూచి పనిని చేయవలెను 673

కార్య, శత్రుశేషములన గాంచు రెండు,
నగ్ని శేషమని చెలగి యడగి రేగు 674

సిరి, వరికరము, కాలము, చేయు వనియు
తగిన చోటన నైదింటి దలప వలయు 675

పని ముగియు విధ, మడ్డంకి పని ముగియగ
నగు పెనుఫల మరసి చేయదగును వనిని 676

చేయు విధము, స్వభావము, చేయగనిన
వాని నడిగి, యెరిగి వని పూన వలయు 677

చేయు వని మధ్య మరియొందు చేయగనుట
ఒకరిచే మరొక కరి నొందుట యగు 678

మిత్రులకు మేలొసగుకంటె శత్రువులను
కూల మగునట్లు చేయుట మేలు గొల్పు 679

శక్తిహీనులు తమవారు జంకుటకయి
తాము, కొరదీర్పు బుధులను దలతు రడగి 680

# 69. దూత్యము

ప్రియము కలిమి, కులీనత, నృపతియెంచు
గుణము; దూతకయిన మంచి గుణములగును 681

నెన, రెరుక, యరసిన మాటనేర్పు, మూడు
లక్షణములు దూతకు తగు రక్షణంబు 682

నృపతిజేరి, జయము తన నృపతి కయిన
విధము దెలుప జాలిన, మేటి విజ్ఞులకడ 683

విజ్ఞత, ప్రియరూప, మరయువిద్య, మూడు
నిండియున్న దౌత్యంబును నెరవదగును 684

కూర్చి నుడివియు నగజెప్పి కొరల విడిచి
తన నృపతికి హితమొనర్ప దగును దూత 685

కరచి, జంకక, తగజెప్పి కడగి యుచిత
ముగ పలుక నమయోచితము గను దూత 686

తనదు కర్తవ్యము నెరిగి తగిన నమయ
మెరిగి, యెడముగని నుడువ నెరుగు దూత 687

తోడు, శీలము, తెగువయు, మూడు గుణము
లమరు నతడు దూత యగుట కర్హుడగును 688

చెప్పినట్లు పరనృపతి కొప్పజెప్ప
వాడు వెడవల్కు జారని వాడు మహిని 689

తనకు నాశమైనను జంకు తాను గొనక
రేనికెపుడు నితవు నల్ప బూను దూత 690

# 70. రాజాశ్రయము

అధిపు జేరు వారు చలికి నగ్ని గదియు
భంగి తొలగక, డాయక బ్రతుక దగును 691

అధిపు డాశించు వానిపై ఆశ గొనక
మనుట తిరమగు పెంపును మహిని గూర్చు 692

ప్రోచికొన కొర జేయక బ్రోవ వలయు
శంక రాజు గొనిన తేర్చ సాధ్యమగునె? 693

చెలుని గునగునలును చెంతజేరి నగుట
మాన వలయు నొకడు మాన్యుల కడ 694

గూఢముగ వినక నెదియు గ్రుచ్చియడుగ
క విభుడు నుడువు నప్పుడు కనుటపాడి 695

గురి నెరిగియు, తరి నరసి కొరవడినవి
విడిచి చెప్పదగు పతికి వేడ్కమీర 696

వేడుకల్ గొల్పునవి చెప్పి విడువ వలెను
ఫలరహితము; రేడడిగిన పలుకరాదు 697

చిన్నవాడు, బంధువనగ నెన్ని యలతి
దలపక మెలగవలె పతి దరిని యెపుడు 698

నృపతి కిష్టుడని తలచి నెరిని వీడి
యొల్లనివి కోవిదులు సేయ నొల్లరెపుడు 699

ప్రాత పరిచయంబు పరిగణించి, పతికి
కాని వాని జేయ కలుగు కీడు 700

# 71. గురియెరుగుట

చెప్పకయె కనుగొని గురి చెప్పువాడు
ఆభరణమున కెన యగు నవని లోన 701

సంశయములేక మనసును చదువ గలిగి
కనుగొను నతడు దేవుని కెనయగు భువి 702

గురుతు ముఖమున గని మది నెరుగువాని
రాజ్య మిచ్చి యైన గొనుట రాజున కగు 703

ఒక్కరూపు గలిగినను ఒరుల కంటె
గురి యెరిగి చెప్పు విజ్ఞుల గుణము వేరు 704

పరుల ముఖ భంగిమల గని భావ మెరుగ
కున్న కనుల ఫలము నొక డొందు టేది ? 705

స్ఫటిక సన్నిధి నున్నది ప్రతిఫలించు
పగిది ముఖము చూపు నొకని భావములను 706

ముదముగ వగపును నొకని ముఖము చూపు
నొందు దాని కంటె వివేకి యుండు టెచట ? 707

మదిని గల భావము గనెడు మనుజు డున్న
ముఖము జూప జాలు నతని ముందు నిలిచి 708

చూపు భేద మరయ జాలు చూపు నదియె
పగయు, నెయ్యంబును తగిన పగిది ధరణి 709

ధీయుతుల మని యను వారి దెలిపెడు కొల
బద్ద వారి కనులె గాని పరము లేవి ? 710

# 72. సభ నెరుగుట

పలుకు నెరి దెలిసిన భవ్యులు యోచించి
కొలువు నెరిగి తాను పలుక దగును 711

కొలువు, సమయ మరసి పలుకుట యుచితము,
మాట శైలి నెరుగు మాన్యులెపుడు 712

కొలువెరుగని వారు పలుక నేరనివారు
వారు పలుక కున్న వరలు మేలు 713

ధీయుతుల చెంత విజ్ఞత దెలిపి, లేని
వారి కడ వెలి సున్నము వలె మనదగు 714

ప్రాజ్ఞులకు ముందు త్వరపడి పలుక కుండ
వినయము గలుగ మేలగు వినుత మతికి 715

విజ్ఞుల మునుపు వినయము వీడి, మాట
పొరబడుట సద్గతి తలగి పోవుట యగు 716

నెరి బలుకు ధీయుతుల కడ నెగడి వెలుగు,
చదువరులు శాస్త్రము లరసి నలుపు విద్య 717

తెలియగలవారి కడ విజ్ఞ పలుకు, వృద్ధి
గనెడు పంటకు నీరిడి కాచుట యగు 718

బుధుల సభ బల్కి మెప్పును పొందువాడు
అజ్ఞులకడ మరచి మాట లాడ రాదు 719

ప్రాంగణంబున నమృతము వడుటయగును
తమ గణము కాని వారితో తగ బలుకుట 720

## 73. సభాకంపనము లేకుండుట

మాటగతుల నెరిగిన సన్మతులు, కొలువు
విధము గని పొల్లు పలుకరు వినయ మడిగి 721

ధీయుతులకు తెలిసినవి తెలియ జెప్ప
నరుడు నేర్చిన జనులం దనయము మేటి 722

పగర జీరి సమయు వారు పలువురు; సభ
జంకు గొనక పలుకు వారు చాల నరిది 723

విజ్ఞుల కడ నెరిగినవి విశదపరచి
నేరిచిన వారిని గదిసి నేర్వవలయు 724

సభను ప్రశ్నలకు జవాబు సరిపడునటు
లీయ శాస్త్రముల జదివి యెరుగ వలయు 725

పిరికి వారికి కత్తితో బేర్మిమేమి ?
సభను జంకు వానికి గ్రంథసమితి యేల ? 726

కదనమున బేడి గైకొన్న కత్తి యగును
సభకు జంకు నతడు నేర్చు శాస్త్రమెన్న 727

పెక్కు విద్యల నేర్చియు నిక్కువముగ
నజ్ఞులగుదురు సభ బల్క నడలు వారు 728

తెలిసియు బుధజనుల సభ పలుకలేని
వాడధముడగు చదువని వారిలోన 729

కొలువునకు జంకి యెరిగియు పలుక లేని
వాడు బ్రతికియు చచ్చిన వాడె భువిని 730

# 74. దేశము

తరుగు లేని పంట, యెరుక గల జనులు,
విరివి యగు సిరి గన వెలయు నాడు 731

వాంఛనీయమై, పెనుసిరి వరలు నదయి,
చెరపు లేనిదై పంటలు చెలగ నాడు 732

కాందిశీకుల భరియించి కప్పమెల్ల
నధిపునకు నీయ గలిగిన నదియె నాడు 733

మిగుల నాకలి, పెనురుజ మించి చెరవు
పగను తొలగించి సద్గతి బరగ నాడు 734

భిన్న వర్గముల, కలిసి పెనగు పగయు
నలత బెట్టు సామంతుల నడప నాడు 735

చేటు లేనిదై, చెడినను సిరి తరుగని
దియయి చెలగిన నుత్తమ దేశ మగును 736

ఇరు విధముల నీరు, మలయు, పరగెడు నది,
యరిది యగు బురుజులును రాజ్యాంగములగు 737

తెవులు లేమి, సిరి కలిమి, మివులు పంట,
యిమ్ము, రక్షణయను నైదు నెనగనాడు 738

వెదకక సిరి గలుగునది వెలయు నాడు
నలగి సిరి పొందనయ్యది నాడు కాదు 739

అన్ని మేళ్లొనగూడియు నరిది ఫలము
నందుట నృపతి చెడినచో నవని యందు 740

# 75. దుర్గము

దండు వెడలిన వారికి, దండును గని
జంకు వారికి కోటయే శరణ మగును 741

మణి వగిది నీరు, బయలును, మల, సొగసగు
నడవి నాల్గును కోటకు నగుట మేలు 742

ఎత్తు, వెడలుపు, దిటవును, నెగయు వగర
కరిది-నాల్గు కలది దుర్గ మంత్రుడు బుధులు 743

కావ జిన్నది, పెనుచోటు గలది, పగర
జెరచునది దుర్గ మన దగి చెలగు భువిని 744

పగరు కొనుట కశక్యమై తగిన కుడుపు
లున్నదై లోని వారికి నొదవు కోట 745

ఎల్ల సామగ్రులు కలిగి యమరినదయి
కలన పోరెడు వీరులు గలది కోట 746

ముట్టి యును ముట్టకయె తలపెట్టియు తగు
వంచన గొన లేనిది దుర్గ మంచన దగు 747

ముట్టడింప దగి నదియు ముట్టడించు
పగర పట్టు విడక గొన దగిన కోట 748

సమరతలమున పగతుల నమయ జేయు
ననుపమ మగు నున్నతి గను నదియె కోట 749

ఎంత యున్నతి గలదైన నేమి పెరిమె ?
ధూర్త వర్తనుల నడుమ దుర్గమున్న 750

# 76. ధనార్జనము

అల్పులను విశిష్టుల జేయు నట్టి సిరుల
కంటె మేలిమి మరొకటి కానరాదు 751

అర్థహీనుల నెల్లరు నవమతింత్రు
అర్థవంతుల నెల్లరు నభినుతింత్రు 752

సిరియగు నఖండ దీవము చెలగి, తలచి
నంతనె వెడలి యడ్డుల నడప గలదు 753

కీడొనర్పక, ప్రతిభతో కూడబెట్టు
ధనము సౌఖ్యంబు నొసగును.ధర్మమెనగు 754

కరుణతో ప్రేమతో రాని కలిమి జూచి
ముదము నొందక చేటని వదల వలయు 755

భర్తలేనిది, సుంకము, పగర నడచి
గైకొనిన సొమ్ము - రాజునకైన కలిమి 756

కరుణ యనెడు కూర్మిగనిన కందు, కలిమి
యనెడు సిరిగల దాదిచే గనును పెంపు 757

కలిమితో చేయు పనులెల్ల మలకు జేరి
యేనుగుల పోరు జూచుట కెనయగు నిల 758

కూడ బెట్టదగు సిరిని, వాడియైన
కత్తి లేదంతకు పగర గర్వమడప 759

మేలిమియగు నర్థంబును మిపుల గలుగ
ధర్మకామము లొక్కట దరికి చేరు 760

# 77. సేనా మహిమ

అంగములు నాల్గు గలదయి యంజకుండు
జేతృ సేన రాజున కగు సిరులకు తల 761

బలము తరిగిన నిడుమలు కలిగిన భయ
పడక యుండి నిలుచునది ప్రాత సేన 762

ఎలుకలను పగరు కడలి వలె యరచిన
నేమి ? పాము బున వినంగ నెటుల నిలుచు ? 763

వతనము గనక వంచన బడక తెగువ
తొలుత నుండియు పోరిదిగా గలది సేన 764

అంతకు డలిగి వచ్చిన నంజకుండ
నొద్దిక నెదిర్చగల సేన యుత్తమంబు 765

వీర, మాన, సద్వర్తనల్, విశ్వసించు
సేవ యను నాల్గు గుణములు సేనకుదగు 766

మీదబడు పగర నెదిర్చి మేలి జయము
నందు విధ మెరిగి నిలుచు నదియె సేన 767

పోరిడెడు నేర్పు, ప్రతిభయు, పొందలేని
సేన వ్యూహ కారణముగ సేవ్యమగును 768

తరుగుట, పతిపై ద్వేషము, తవులులేమి,
లేనిచో విజయము గొను సేన వేగ 769

తిరముగ చిరకాలము సేన వరగు చుండి
నను పతి గొనక ఫలమును గనుట యరిది 770

## 78. సేనా గర్వము

పగతులార! మావతిదల పడకుడు, పడి
శిలల రూప మొందిన వారు పలువు రిచట 771

శశము నడవిలో వడనేయు నమ్ముకంటె
కరిని గూల్చని యమ్మును గైకొనదగు 772

పగనెదుర మగటిమి యం్రడు పగరిడుమల
బడగ మేలు జేయు నదియె పదుసయినది 773

ఈటె కరిమీద నిడి యొండు ఈటె కొరకు
నరయ మేనిపై నదియుండ నలరి వినరు 774

పగర గినుక జూచు కనులు, బల్లెమిడగ
మూసిన నది యోటమికాదె! దోస మగును 775

గడచిన దినముల దలచి గాయ పడని
దినములు వృథయని గణించు మనము నందు 776

ఆతత యశము గని యసువులు కోరని
యతడు పెండె మిడగ నంద మగును 777

అని నసువులకు జంకక నమరు భటుడు
నృపతి యలిగినను ఘనత న్నెగడు చుండు 778

శపథము గొని నటులు పోరు నలిపి మరణ
మందు వీరుడు నేరము నొందు టేది ? 779

కాచిన పతి కనుల నీరు కలుగ చావు
కలిగెనేని కోరదగును కడగి దాని 780

## 79. చెలిమి

చేయుట కరిది వెయ్యేవి చెలిమికంటె
పని కరిది వేవి కలవు కాపాడ గలవి ? 781

శుక్లపక్ష చంద్రునివలె సొగయు బుధుల
చెలిమి, కృష్ణపక్షంబగు చెడ్డ చెలిమి 782

కరచు చున్నంత మోదము కలుగుట వలె
సజ్జనుల చెలిమి పెరుగ సంతసంబు 783

సంతసింప గాదు చెలిమి, సచివుడు పెడ
మార్గమున జన వానిని మందలింప 784

కలిసి మనుట, పరిచయము చెలిమికాదు
చెలిమి యోగ్యత సమమగు తలపులగును 785

చెలిమి ముఖ వికసనమున జేయ దగదు
హృదయ ముప్పొంగ జేయుట హెచ్చుచెలిమి 786

దుష్టమెడపి చూపించును శిష్టములను
కష్టములగూడి తోడుండి కాచు చెలిమి 787

వలువ తొలగినంతనె చేయి వచ్చు పగిది
కలత తొందర బాపిన చెలిమి యగును 788

చెలిమి మేలిమి యేదన తొలగిపోక
వీలయిన వేళ నొదవెడు వినుతగుణము 789

ఇతడు నాకిట్టి వాడని యిట్టివాడు
నేననుట యపకారము నెయ్యమునకు 790

## 80. చెలిమి నరయుట

చెలిమి చేసిన తదుపరి తొలగరాదు
చెలిమి నరయక చేసిన చేటు గాంచు 791

అరయక చెలిమి చేసిన నదియె మరణ
కారణమయిన దుఃఖము గలుగ జేయు 792

గుణము, కులము, లోపములను కొరతలేని
బంధువుల నరసి చెలిమి బడయ మేలు 793

సత్కులము వాని, నిందకు జంకు వాని
సిరి నొసగియైన నెయ్యము చేయదగును 794

చెడు పనుల జూచి దుఃఖము చెందునట్లు
మందలించు వాని చెలిమి పొంద దగును 795

చేటుకూడ మేలొందించు చెలిమికాండ్ర
గొలుచు కొలబద్దయై యది తెలుపు నిజము 796

ఒకడు మేలొందు పెట్లన్న నొరుల దెలిసి
కడగి యవివేకి చెలిమిని విడుచుటయగు 797

తలప రా దూకువ మదిని తరుగు పనుల
కలగ వీడు సఖుల నెద నిలుపరాదు 798

చెడినపుడు వీడు చెలికాండ్ర చెయిదమెన్న
మరణమేతెంచు నపుడును మదిని గాల్చు 799

చెలిమి నిర్మలాత్ముల కడ చేయ వలయు
నొప్పనిది విడువదగు నొండొనగియైన 800

# 81. చిరపరిచయము

బాధ్యత యని యొకడొనర్చు పనిని కించ
పరచకుండు చెలిమి చిరపరిచయమగు 801

చెలిమి కంగంబు వాక్కగు తెలిసి దాని
కొడబడెడు ధర్మ మార్యుల కుచితమగును 802

సఖుడు మునుకొని కార్యము నలుప, తాను
సలిపినట్లు తలవకున్న చెలిమియగునె ?

అడుగకయె సఖుడొక కార్య మాచరింప
విజ్ఞు లిచ్ఛగింతురు దాని వినుతిజేసి 804

అహితము సఖుడొనర్చుట యజ్ఞత, మరి
పరిచయాధిక్యమోయని యెరుగదగును. 805

చెలిమి మేర నిలుచు వారు చేటునైన
ప్రాత చెలికాండ్రను విడిచి పాయలేరు 806

ప్రాత చెలిమిని కలవారు పతనమొసగు
క్రియలొనర్చినను విడరు ప్రియమునెపుడు 807

సఖుల తప్పు చెవిగొనని సజ్జనులకు
తప్పు తమకు చేయుదినము తగు సుదినము 808

తొలిదినముల పరిచయము చెలిమి కాండ్రు
విడువకుండిన లోకము వినుతి జేయు 809

చెలిమినెపుడు వీడని వారి చెలిమి కొరకు
పగతుడైనను కీర్తించి పడయ నెంద్రు 810

# 82. చెడు చెలిమి

కోరికి తినునట్లు ప్రేమను నెరపనేమి?
చెడు చెలిమి పెరుగుట కంటె చెడుట మేలు 811

చెలిమి, ఫలము కొరకు చేసి విడుచు వారి
చెలిమియున్న నేమి? చెడిననేమి? 812

ఫలము నాశించు నెయ్యురు, వెలను కోరు
పొలతులును, దొంగలు, సములె-పోల్చిచూడ 813

సమరమున బడ ద్రోయు నశ్వనికరమగు
చెలిమికంటె యొంటరి యైన చెలగుమేలు 814

కాచినను కావనేరని కడు నధముల
చెడు చెలిమికంటె మేలగు చేయకున్న 815

అజ్ఞ చెలిమికంటె విజ్ఞవిరోధము
కోటి రెట్లు మేలు కూర్చునవని 816

పగర వలని పనులు పదికోట్లు మేలగు
నగుట చెలిమియైన పగిదికంటె 817

సాధ్యము నసాధ్యముగ జేయు నఖుని చెలిమి
మాట మాత్రము తెలుపక మానవలయు 818

చెప్పుటొకటి చేయుటొకటి చెలిమియైన
స్వప్నమున కూడ దుఃఖము సాగుచుండు 819

ఇంట ప్రియము జూపి సభలో నీనడించు
వారి చెలిమి శేషము లేక వదలవలయు 820

## 83. కూడని చెలిమి

తగని వారి చెలిమియన దగిన చోటు
నరసి వడవేయు పట్టెడ యగును సుమ్ము 821

వెలుపలొకటియు మదినొండు వేశ్య తలపు
వలెనమరు చెలమినటించు వారికూర్మి 822

మంచి పొత్తము ల్గరచియు మంచిమనను
గౌరవములేని వారికి కల్గుటరిది 823

వదనమున నగవు మదిని వంచన గొను
జనుల తోడ చెలిమి చేయ జంకవలయు 824

మదినమరని వారు నుడువు మాటలు విని
కార్యమెట్టి దైనను నమ్మి కడగరాదు 825

చెలిమి కలవారి వలెమేలు చెప్పువారు
పగతురైనను నిజమది బయటపడును 826

పగరమాట నమ్రత జూచి పరవశింప
దగదు, వింటి నమ్రత వలె తవులు కీడు 827

పగరకైమోడ్పులో చంపు పరికరంబు
నుండవచ్చు, కనులనీరు నొప్పునట్లు 828

చెలిమి బయట, లోనెగ్గును చేయువారి
చెంత నట్లొనర్చి చెలిమి చెరువదగును 829

పగచెలిమి యగునప్పుడు పైకి చెలిమి
నలిపి విడువదగును దాని నమయమెరిగి 830

## 84. బేలతనము

చెడును కోరి మంచి విడిచి జీవించుట
తలప నదియె బేల తన మనదగు 831

బేనతనముల కడు బేలతనమనంగ
నెసగు ననహాజంబు నిష్టపడుట 832

నాన బడమి, నెనరులేమి, నయమరయమి,
మేలు కోరమి యనునవి బేల జెందు 833

చదివి, సారమెరిగి జనులకు నుడివియు
నాచరింప నేరడవని బేల 834

ఏడు జన్మలందు నెసగు నరక బాధ
నొక్క జన్మలోన నొందు బేల 835

శీల మెరుగ జాలని బేల చేయబూను
పని చెడి, వెనుక శిక్షకు పాత్రుడగును 836

బేల సిరు లొరులకు మేలొనర్చి హితుల
నొకటబడ వేసి యలయజేయు 837

పిచ్చివాడు త్రాగి పెనుకైపు గనుటగు
బేల సిరుల హొంది పేర్మి గనుట 838

ఇంపుగూర్చు బేలచెలిమి యేలన నది
తలగినప్పుడు దుఃఖము కలుగబోదు 839

కడుగక పడుక వయికాళ్లుంచు విధమగు
పెద్దల సభలోన బేలచనుట 840

# 85. తెలివిలేమి

లేములందు తెలివి లేమియె పెనులేమి
యితరములను లోక మెన్నదెపుడు 841

బుద్ధి లేని వా డీవికి పూనుటెల్ల
పడయు వాడొనర్చిన తపః ఫలిత మగును 842

అల్పబుద్ధులు తమకు తా మలత వెట్టు
నట్లు శత్రువులకు సైత మలవి కాదు 843

ధరణి నవివేక మేదన తమకు తామె
విజ్ఞుల మని తలచి విర్రవీగుట యగు 844

చదువనివి చదివి నటుల చాటువాడు
చదివినవియు కలుగజేయు సంశయంబు 845

దోషములు వీడక నొడల దోచు గుహ్య
ముల వసనముల గప్పుట మూర్ఖతయగు 846

అరిది మంతనము బయలు వరచువాడు
తనకు తానె చేటును బొంది తవన జెందు 847

తనకు తాను మేలరయక వినక నుండు
వాని యుసురు పోవువరకు వ్యాధియగును 848

అజ్ఞుని కెరుగ జెప్పు వాడజ్ఞుడగును
అజ్ఞు డెరిగి నంతకు దోచు విజ్ఞభంగి 849

జనులు కలదను దాని లే దనెడు వాని
పరిగణించు పిశాచము పగిది జగతి 850

# 86. పగ

ప్రాణులు పరస్పరము మారు పాటు గొనెడు
చెడు గుణము బెంచు రోగము కడు పగయగు 851

మారుపాటు గొని యొకడు మనలి చేటు
చేసినను కీడు సలుపమి చేయు మంచి 852

వైరమను దుఃఖరోగము వదలి నపుడు
వెలయుకీర్తి శాశ్వతమయి విశ్వమందు 853

చేటుల పెనుచేటగు పగ, చెడిన కలుగు
సంత సములందు మిక్కిలి సంతసంబు 854

పగనెదిర్చక తలవంచి బ్రతుకువాని
జయము గొనగల వారేరి? జగమునందు 855

జయము నింపుగల బ్రతుకు స్రగ్గుట
నాశమగుటయు పగకారణముగ కలుగు .856

జయము నొనగు కారణముల సత్యమరయ
లేరు పగయను చెడుబుద్ధి కోరువారు 857

మారుపాటుకు తలవంచి మనుట పెంపు
ఎదుర గెలువ దలచిన రా నెంచు కీడు 858

కనడు పగను పెంపు గాంచునపుడు, దాని
గెలువ గోరు నొకడు కీడు గాంచ 859

చేటు లన్నియు పగగొన చెలగు, చెలి
వలన నీతియనెడు మేల్మి కలుగు చుండు 860

# 87. పగబలిమి

బలము గలవారి నెదురింప దలపరాదు
బలరహితులతో విడువక పగగొనవలె 861

అప్రియు డసహాయుడ బలుడయిన వాడు
పగబలంబు నడచి నెగడు టెట్లు? 862

అంజువా, డజ్ఞు, డవగుణు, డవని యీవి
నలుపని యతడు, సులభుడు శత్రువులకు 863

కోపముగలవాడు, తిరముగొనని వాడు
ఎపుడెచట నయిన సులభుం డేరికైన 864

మార్గ, ముచిత, మెగ్గు, గుణము, మదిదలపని
వాడు పగరకు సులభుడై యోడి పోవు 865

కాననికినుక, పేరాస, కలుగు వాని
పగగొనుట కిచ్చగింతురు పరులు ధరణి 866

తనను గూడియు తగనివి తలచు వాని
పగను సొమ్మిచ్చి యైనను పడయ దగును 867

గుణరహితుడు లోపంబులు గొనిన, తోడు
లేని వాడగు పగకది యీను మేలు 868

తెలివి లేక జంకు గుణము గలుగువారి
పగకలిగెనేని సుఖము లపరిమితములు 869

చదువు రాని వాని పగను నలువు సులభ
కార్యమైన చేయక కీర్తి కలుగబోదు 870

## 88. పగ ప్రతిభ నెరుగుట

పగయను నవగుణము నగుటకేని నొకడు
మదిని తలచు టెవుడు మంచికాదు 871

విల్లరక కర్షకుల వగ వెనగొనినను
పలుకరక గల కావుల వగ తగనిది 872

ఒక్కడయి పగతుల పెక్కుర గొనువాడు
పిచ్చి వానికంటె పెచ్చు వెడగు 873

పగను నెయ్యముగా జేయు భవ్యమతిను
పొంది వర్తిలు చుండును పుడమి యెపుడు 874

తానొకడు వగరిద్దరు తనకు తోడు
లేరొకని యందు తోడుగ కోర దగును 875

ఒకని యెడ తేరినను తేరకుండ గడిపి
నను నడిమిగ నుండ దగును నాశమందు 876

కలత నెయ్యురకెప్పుడు తెలుపరాదు
శత్రులకు బలహీనత చాటరాదు 877

వెరవెరిగి బలమును పెంచి యరసి తన్ను
కాచుకొన గలిగిన పగ గర్వముడుగు 878

ముండ్ల చెట్టు నరుకదగు మొలక యందె
ముదిరిన నరకు వానికి ముప్పుదెచ్చు 879

శత్రుమదమణచని వారు శ్వాస విడుచు
వరకు తిరముగ జీవించు వారుకారు 880

# 89. లోపగ

నీడ, నీరము, రోగము నిల్చినపుడు
కీడు, బంధు నైజమటుల కీడొనర్చు 881

పగయె ఖడ్గమై వెలినిల్వ భయము వలదు
జంక వలె బంధులై తోచు శత్రువులకు 882

కాచుకొనదగు పగకంజి, క్షణము తలగ
వచ్చికుండ గోసి చెరచు పరికరమగు 883

మనసు తేరని లోపగ గనిన బంధు
వర్గము చెడెడు నంతటి వంతదెచ్చు 884

బంధువుల యెడ లోపగ పరగెనేని
చావున కగు కీడుల నది నలువుచుండు 885

ఒకడు హితులతో లోపగ నొందెనేని
ఎప్పుడైనను నాశము తప్పు టరిది 886

కులము లోపగ కలిగిన కూడి యుండు
టరిది వెలిదోచునది రాగి యతుకు భంగి 887

ఆకు రాయి యినుము నరుగ దీయు పగిది
కులము లోపగ గన బలము తరుగు 888

నగము నువుగింజ నమమైన జాలు, కలుగు
చేటు, లోపగ కతమున వారిల మనుట యనగ 889

మనసు కలియని వారిల మనుట యనగ
పాము గల యింటి లోపల బ్రతుకుట యగు 890

# 90. పెద్దల తెగడకుండుట

రక్షణల కెల్ల నుత్తమ రక్షణంబు
తెలియ కృతకర్ముల గరిమన్ దెగడమి యగు 891

పెద్దలను గౌరవింపమి తద్దయు నగు
నట్టి పెద్దల చేత కీడెట్టు లైన 892

అడచ దలచిన నట్లు చేయగలవారి
చెంత చెడదలచిన తప్పు చేయదగును 893

ప్రతిభ కల వారి యెడ, లేని ప్రజలు కీడు
తలచుట యముని చేసాచి పిలుచుట యగు 894

బలముగల రాజు కోపము బడయు వారె
చట చనినను జీవింప నసాధ్యమగును 895

నిప్పుచే గాల్బ ప్రాణము నిలువ నగును
తప్పు పెద్దల యెడ జేయ తప్ప లేరు 896

యోగ్యుడగు పెద్ద యలిగిన నొకడు సిరియు
భవ్యజీవిత మొందియు ఫలము లేదు 897

పర్వతసములు చెడనెంచ భద్రజీవ
నము గడపు వారి కులమును నాశముగను 898

ఉన్నతాశయములు కినుక నొంద రాజ
యినను రాజ్యము కోల్పోయి యిడుమలబడు 899

ఉత్తమోత్తముల కినుక నొంద నమిత
మైన తోడున్న వారును అరిది మనుట 900

# 91. భార్యననుగమించుట

అరిది సత్ఫల మెయుట యాలి మాట
వినగ; కర్తవ్యము నొనర్ప విడదగునది 901

మగతనము బ్రోవక మగువ మరులున బడ
సిరులు చెడి నానదగినదై చేటు దెచ్చు 902

భార్య కడగు హీనస్థితి పతికి గల్గ
సజ్జనుల నడుమ మనల లజ్జనొంద, 903

భార్యకు వెరచు పరలోక ఫలిత శూన్యు
డాచరించు కార్యము పేర్మి నందు టరిది 904

సతికి జంకు వాడు సజ్జనులకు మేలు
సలుప నెల్లపుడును జంకు వారు 905

సతిభుజములకు సతతము జంకు వారు
వేల్పులవలె బ్రతికినను పేర్మిగనరు 906

మగువ యానతి పాటించు మగతనమ్ము
కంటె సిగ్గిలు స్త్రీత్వంబు కలిమి మేలు 907

నెయ్యురకొరల దీర్పరు నెరిదలపరు
పడతి కోరినట్లు మెలగి నడచు వారు 908

ధర్మకార్యము, తగుసిరి, తక్కు క్రియలు
సతి పలుకును దాల్చెడు వారి సరస లేవు 909

మిగుల సరయు మనసుగల మేటి వార
లాలి మాట వినెడు దైన్యమందబోరు 910

# 92. వేశ్యాలు

ప్రేమ లేక ధనమునకై ప్రీతిజూపు
వేశ్య మధుర వాక్కొకనికి వెతల గూర్చు 911

ఫలము జూచి దానికి తగు పలుకులాడు
గుణవిహీనల వేశ్యల గొనకు పొందు 912

వెలవెలదుల కౌగిలి, మును తెలియరాని
శవము జీక టింట తడవు సాటి యగును 913

కరుణ నరయు ధీమంతులు కనకమరయు
వారకాంతల పొందుకై వాంఛగొనరు 914

ధనమొసగు వారి కెల్లను తనువునిచ్చు
కులట పొందును ధీయుతుల్ కోరుకొనరు 915

వీగు వేశ్యభుజములకై వేడ్కగనరు
తమదు సన్మార్గముల తల దాల్చువారు 916

చిత్తమడపలేని జనులు చిత్త, మొండు
కోరు వెలయాండ్ర భుజముల కోరుకొండ్రు 917

అరయలేని వారికి వెల యాండ్ర చెలిమి
ఏర్పడనది మోహిని యావహించుటండ్రు 918

మేరయెరుగని వెలయాండ్ర మృదుల భుజము
నయమెరుగని నీచులుమున్గు నరకమగును 919

మద్యమును, జూదమును రెండు మనసులుండు
వెలదియు సిరివీడిన వారిచెలిమి కోరు 920

## 93. కల్లు త్రాగకుండుట

కల్లుపై నిచ్ఛగలవారు కాంతి వీడి
పగరకు వెరవుగలిగింప బ్రతుకలేరు 921

త్రాగరాదు కల్లెప్పుడు, త్రాగదగును
మంచివారి మన్నన మది న్మాను జనులు 922

కన్న తల్లియు కనకుండు, కల్లు మంపు
తప్పు నిందించు పెద్దల చెప్పనేల ? 923

వ్రీడయనెడు సదంగన విడిచిపోవు
కల్లుగైకొను దోషము కనిన వాని 924

వెల నొసగి మేను మరచెడు విధమరయగ
చేయునది యేమొ యెరుగని చేష్టయగును 925

నిదుర మృతికి భిన్నముకాదు నియతిలేక
త్రాగి మత్తిలుట విషము త్రాగుటగును 926

చాటు నందు త్రాగెడు వారి చరిత మరసి
పరిహాసింతురు వారుండు పల్లెజనులు 927

త్రాగి యెరుగ ననుటుడుగ దగును; మదిని
దాగు కలుషము వెలువడు త్రాగినపుడు 928

కారణము మత్తుగొను వాని కడ నుడువుట
జలమున బడు నతని దివ్వె దెలియుట యగు 929

త్రాగనవుడు త్రాగిన వాడు తత్తర పడ
తలపడొకొ త్రాగుట వలని దైన్యగతిని 930

# 94. జూదము

జూదమెన్నరాదు జయము జూచి, చేప
గాలపుటినుము నెరయని కవ్వుట యగు 931

ఒండు కొని నూరు గోల్పోవు చుండు జూద
రులకు ఫలమెయ్య నొకదారి కలదె తలవ 932

పాచిక నొక డెడ తెగక వలుక, వచ్చు
సిరిపదవడి యెదుటి వాని జేరు చుండు 933

పెక్కనర్థములను బెంచి పేదరికము
నిచ్చు జూదము గాక వేరేది కలదు? 934

పాచిక, కెలను, కైనేర్పు భావ్యమనుచు
వదలకున్న నేమియు లేని వారగుదురు 935

జూద మనెడి పెద్దమ్మ చే చుట్టబడిన
వాడు కడుపార తినలేక వంతలబడు 936

ప్రొద్దు జూదరంగంబున పుచ్చువాని
సిరుల, సద్గుణముల నెల్ల చెరపునదియె 937

సిరిజెరచు, కల్లలను నేర్పు, చెరచు కృపను
కలతల పలు భంగుల దెచ్చు కైతవంబు 938

యశము, విద్య, సంపద, గుడ్డ, యన్నమనెడు
నైదు పొంద జాలడు జూదమాడువాడు 939

ఓడు కొలది జూదము నిచ్చ నొందుట వలె
నాశ కలుగుసురు వయి మే నలయు కొలది 940

# 95. మందు

పిత్తవాతకఫంబులు పెరుగ, తరుగ
వ్యాధి కలుగు చుండు ననియె వైద్యులంద్రు 941

మందు వల దొడలికి ముందన్న మరిగిన
నరసి వెనుక తాను ఆరగింప 942

అరిగినవి మితముగ దిన నదియె మేను
నధిక కాలము కాచుటకైన విధము 943

అరిగిన నెరిగి మారు పాటవని వాని,
నరసి తినదగు నాకలి యయిన వేళ 944

మారుపాటు గనని తిండి మీరనీక
తినిన నొడలి యందుసురుకు తెవులు లేదు 945

అలవిగ తిను నతడు ముద మందుట వలె
మెండుగ భుజించు వానికి మించు వ్యాధి 946

జఠర మందగ్ని సమముగ సాపడవలె
నధికముగ దిన్న రోగము లధికమగును 947

రోగమరసి మూలమరసి రోగ మడప
వెరవు నెరిగి మందొనగుట వెజ్జుకు దగు 948

రోగి వయసు, వ్యాధి యలవి, రోగకాల
మెరిగి తగినట్లు వెజ్జు మందీయవలెను 949

వ్యాధి కలవాడు, వైద్యుడు నౌషధంబు
నూడిగపు వాడనగ వైద్య మొప్పు తీరు 950

# 96. కులీనత

మంచినడత, నాన యొకట మనుజు లందు
సత్కులులకు గాక యరిది సహజ మగుట 951

సత్ప్రవర్తన, నానయు, సత్యమనెడు
మూడు విడువరు సత్కులము గలవారు 952

హాస, మీవి, యింపగు మాట యగడు లాడ
కుండుట గుణములగు సత్కులోద్భవులకు 953

కోట్ల సిరులు వచ్చినను సత్కుల జనితులు
చేయరు కులము జెరపెడు చెడుగులెపుడు 954

దాన మిడుట లేమివలన తరిగినను కు
లీనులు సహజగుణమును మానుకొనరు 955

వంశము నిలుప మనువారు వంచన గొని
తగని కార్యములు నలుప తలపరెపుడు 956

ఉన్నత కులజుల దొసగు మిన్నుపైని
చందురుని మచ్చ పోలిక స్పష్టమగును 957

సద్గుణముల నడుమ ప్రేమ సడలి యుండ
చాలుకులము మీద కలుగు సందియంబు 958

మొలక తెలుపు నేల తెరగు, కులము తెరగు
తెరపు నొకని నోటినుడులు తేట పడగ 959

నాన కలుగ మేలు కలుగు నయవినయము
నొంద సర్వుల యెడ కుల మున్నతి గను 960

## 97. మానము

చేయదప్పని మంచియు చేయరాదు
వంశమునకు కళంకము వచ్చునవిన 961

యశములో మగటిమి కోరునట్టి వారు
యశముకై తగనివి చేయ నాశగొనరు 962

సిరి పెరుగ వినయము జెందవలె, తరుగ
యడగని పెరిమె గొని యలరవలెను 963

తమనెలవుల దప్పిన వారు తలను వీడి
యూడి పడు వెంట్రుక పగిది నొప్పు వారు 964

కుందుటకగు తప్పు గురివింద యంతైన
కొండనములె యైన కుందుదు రిల 965

రాదు యశము, నాకమమరబోదు, దూరు
వాని వెనుక చని నిలుచు వానికెపుడు 966

ఎగ్గు చేయు వాని వెనుక నేగి మనుట
కంటె చనకయె మరణంబు గనుట మేలు 967

పేర్మి చెడిన పిదప మెయి బెంచి, కాచి
మనుట చావకుంటకు దగు మందగు నొకొ? 968

చమరి రోమమొకటి వీడ చచ్చు పగిది
మానధనులది చెడ గాంత్రు మరణమంత 969

నిందకలుగ మరణ మొందు వారి యశము
బొగడు చుండ్రు జనులు భూమినెపుడు 970

# 98. పెరిమె

ఒకని కూకువ బలిమియె యొసగు కాంతి
యది విడిచి మనుదు మనుట యపయశమగు 971

జన్మచే నములందరు నలువు కార్య
భేదము వలన యోగ్యతా భేద మమరు 972

అవగుణులు మీద నున్నను అల్పులె, మతి
సద్గుణులు క్రింద నున్నను సత్పురుషులె 973

భద్రశీలయగు పడతి భంగి తన్ను
తాను కాచుకొన పెరిమె తనరుచుండు 974

పెరిమె కలవారు చేయుట కరిది పనులు
చేయదగు విధము నెరిగి చేయ గలరు 975

అల్పుల మది నుండ దార్యుల సేవించి
పేర్మి గాంచు నట్టి పెను తలంపు 976

తగని నీచులకడ మేల్మి నెగడగనిన
క్రమ విరహితంబుగా నది కాంచిన దగు 977

పేర్మిగుణ మడకువ గొను, కూర్మి దన్ను
నచ్చెరువున పొగడికొను నల్పగుణము 978

గర్వమొందమియె పెరిమె గర్వమెయ్డి
జీవితంబును గడుపుట చిన్న తనము 979

పరుల లోపములను దాచు పెరిమె, చిరుత
గుణము వెలిబుచ్చు చుండును కొరలనెపుడు 980

## 99. మేలిమి

మంచివెల్ల కర్తవ్యము లంచు చెలగు,
విధులెరిగి మేలిమినిగాచు విజ్ఞుల కిల 981

గుణముల నయంబె పెద్దలు కొనునయంబు
ఏనయము నందు నితరము లెనగవెపుడు 982

నెనరు, నాన, సాయగుణము, నిండు దయయు
సత్యమన నైదు మేలిమి స్తంభములగు 983

చంపకుండుట తపమగు జనులదోష
మెంచకుండుట మేలిమి యంచు పరగు 984

ప్రతిభ కలవారి కణకువ ప్రతిభ; యదియె
సజ్జనులు పగతుర మార్చు సాధనమగు 985

అసముల యెడను నాధిక్యమరయ గల్గు
నదియె సుగుణములకొరగల్లనగ చెల్లు 986

చెడుగు చేయువారికి మంచి చేయనపుడు
మేలిమి వలన కలిగెడు మేలు కలదె? 987

లేమి వలన కొరత లేదు మేలిమి యను
బలమొకనికి జగతి కలిగియున్న 988

ప్రళయమేతెంచినను తమ పథమువిడువ
రబ్ధినమపూర్ణ గుణవంతు లవని యందు 989

పూర్ణ గుణ మార్యులు విడువ, పుడిమియైన
తన్ను మోయజాలక తల్లడిల్లు 990

## 100. సంస్కారము

మంచి సంస్కారవంతుడై మనుట సులభ
మేరికిని సులభు డగుచు నెనగునపుడు 991

ప్రేమయు, కులీనత నొకట పెనగి యుండ
నదియె సంస్కారవంతున కైన పథము 992

తను సమత కాదు సామ్యము జనుల నడుమ
తవులు సంస్కారసామ్యమె తగిన సమత 993

నయ సహిత ధర్మనిరతులై దయనితరుల
కొదవు వారింబొగడు చుండు నుర్వియెపుడు 994

నగుట కేని నింద తగదు పగగొనినను
మంచి యుండు సంస్కారుల మనములందు 995

సద్గుణుల జెంది వర్తిలు జగము; లేని
యెడల మట్టిలోన కలిసి యింకి పోవు 996

హీన సంస్కారులాకురాయి నికరమగు
బుద్ధిమంతులైనను మ్రాకు బోలువారు 997

మైత్రినెరవక చెడు జేయు మనుజు వెంట
గుణము వీడి చరించుట కూర్మికాదు 998

నగుట యెరుగ లేని నరునకిమ్మహి లోన
పగలె చీకటౌచు పరగుచుండు 999

అవగుణుని పెను సంపద యనగ, చెడిన
పాత్ర యందిడ రుచి చెడు పాలుబోలు 1000

# 101. వ్యర్థ సంపద

సంపదల బెంచి కుడువక చచ్చెనేని
చేయదగినది లేవట్టి సిరుల వలన 1001

సిరులు సర్వమని తలంచి మరులున బడు
నట్టి లోభి యధమ జన్మమవని నొందు 1002

యశము గోరక నార్జన యవధియనుచు
పొడమి మనెడు వాడు బరువు పుడమికెపుడు 1003

పరుల మెప్పు గనని వాడు మరణమొందు
పిదప మిగులున దేవని యెదతలపడొ ? 1004

ఇడుటయు ననుభవించుట యెరుగడేని
ఫలితమేమి? కోట్ల సిరులు కలిగియుండ 1005

తగిన వారికి నొనగక తా కుడువని
వాడు సిరులకు రోగమై వరలువాడు 1006

ముదిత యొంటరియై మని ముసలి యగుట
కెన యగును లేని వానికి నిడని సిరులు 1007

పరులచే నిష్టపడకుండు వాని సిరులు
పల్లె నడుమ విషతరువు పండినట్లు 1008

తన్నడచి, ప్రేమ యుడిగియు ధర్మమెంచ
కుండు వాని నంపదలెల్ల యొరుల కగును 1009

శ్లాఘనీయ ధనికులకగు చిరుత లేమి
వాన కురియు మబ్బు వంటి దగును 1010

## 102. నాన కలిగి యుండుట

తగిన పనికి నానుట నాన తరుణి సొబగు
లీను వదనంబున దొరలు నాన వేరు 1011

అన్న వస్త్రము లితరము లమరు నెల్ల
జీవులకు, నాన నరులకు చెలగు ఘనత 1012

మేను నెలవు జీవులకెల్ల నాననెలవు
చాలికయను గుణమునకు జగతియందు 1013

ఆర్యులకు నానతొడవగు నట్లుకాని
వర్తనం బెట్టిదైనను వ్యాధియగును 1014

తనకు నితరులకును నింద తవుల సిగ్గు
నందు వాని నానకు నెల వగును జగతి 1015

లజ్జయను కంచె నెంచక సజ్జనాళి
పూని జీవింప కోరదు పుడమి మీద 1016

నాననేలు వారసువులు నానకొరకు
విడుతు రసువులకై నాన వీడ లేరు 1017

ఒరులు సిగ్గిల తా లజ్జ నొందడేని,
నానగొని చను ధర్మము వాని వీడి 1018

చెడు కులము లక్ష్యము విడువ సిగ్గు విడిచి
మసల చెరపునది యొకని మంచి యెల్ల 1019

మదిని సిగ్గులేని జనులు మనుట, కొయ్య
బొమ్మ త్రాటిచే జీవము పొందినట్లు 1020

# 103. వంశోద్ధరణము

కర్మ చేయనొకడు వెనుకంజ వేయ
ననెడు పేర్మికి మించిన దరయ లేదు 1021

జతనమును నెరతెలివియు జతగకూర్చి
పనులు గావింప వంశంబు పరిఢ విల్లు 1022

కులము నుద్ధరింపగ కృషి సలుపునేని
వలువ బిగియించి దైవము నిలుచుముందు 1023

స్వకుల కర్మంబు లలయక సలుపు వాని
కతడెరుగకయె నెరవేరు నన్ని పనులు 1024

చుట్టమని చుట్టుకొను నిలయెట్టి తప్పు
లంటని కులవర్ధనుడయి యలరు వాని 1025

తన కులము నేలు పేర్మియే తనకగునటు
లల వరచమేలిమగటిమి యగు నొకనికి 1026

కయ్యమున నిజవీరుని కైవడి కుల
భారము భరించు వారిపై పడును జగతి 1027

కులము గాన లేదొక తరి యలసత నభి
మానము నెరప వంశము మరుగున బడు 1028

తన కుటుంబము తప్పుల దవులు కొనక
నిల కడగు వాని యెడ లిడుమల నెలవొకో? 1029

ఒడయు డొక డాదు కొనడేని యిడుమయనెడు
గొడ్డలి కుల వృక్షంబును కూల్చి వేయు 1030

## 104. సేద్యము

ఎటు తిరిగియు భువి నిలుచు నేరు వెనుక
సేద్య మిడుమల బడినను శ్రేష్ఠతమము 1031

హలము పట్టువారు పరుల నాదుకొనెడు
వారు కాన యిరుసు చీల వంటివారు 1032

పొలము దున్ని మనెడు వారె భువిని మనెడు
వారు, సేవించి వెనుచను వారు పరులు 1033

పలుగొడుగు నీడలను తమ పతి గొడుగున
గాంచుదురు ధాన్య సంపద కలుగు వారు 1034

అడుగ రడిగిన వారికి నిడుదు రెపుడు
చేతి పనులొనర్చి కుడిచి చెలగువారు 1035

కర్షకుల కృషి యడగిన కామములను
వదలితిమను యతులకును బ్రతుకులేదు 1036

పలము మన్ను దున్నిన పావు పలమగునెడ
పండు పిడికెడెరువు లేక పంటలందు 1037

ఏరుకంటె మే లెరువిడ, పైరు కలుపు
నేరి కావుంట మేలు మేలు నీరిడుట కంటె 1038

రైతు పొలమేగకుండిన నాతని సతి
వలెనె నిరసించి ద్వేషించు పొలము నతని 1039

తాము లేని వారల మను సోమరులను
గాంచి పొలమను సత్సతి కడు హసించు 1040

## 105. దారిద్ర్యము

లేమి వలె దుఃఖకరమైన దేమి యనగ
లేమివలె దుఃఖమైనది లేమియె యగు 1041

లేమి యనెడు పాపి యొకని నాముకొనిన
వాని కిహావర సుఖములు లేని వగును 1042

కులవు పేర్మి కీర్తు లొకట కూల్చు; లేమి
యనెడు నాశ నొకని చేరి యావహింప 1043

మంచి కులజుడైనను లేమి ముంచు నపుడు
మరవు కలిగి నీచంబుగ మాటలాడు 1044

వివిధ దుఃఖము లేవేని తవులు; లేమి
యనుభరింప రాని యిడుమ యలము కొనగ 1045

మంచి విషయ మరసి మాటలాడియు కూడ
పేదవానిపలుకు బీరువడును 1046

ధర్మబాహ్యమయిన లేమి తవుల నొకని
తల్లియును పెరవానిగా తలచు నతని 1047

చంపినటుల నిన్న కలత చాల వెట్టి
నట్టి లేమి నేడును నన్ను వట్టుకొనునొ? 1048

నిప్పు నడుమనైన నిదురపోవచ్చును
లేమి యుండ మూయ లేము కనుల 1049

తిండి లేని వాడు తొరగ కుండు పేల
యనగ నుప్పుకు గంజికి యముడగుటయె 1050

# 106. యాచన

అడుగ దగిన వాని గనిన నడుగ దగును
దాచిన యెడ తప్పతనిది తనది కాదు 1051

అడుగుటయు నిమ్ము కలిగించు నడిగిన యది
యశ్రమంబుగ నిల లభ్య మయ్యెనేని 1052

దావరికము లేని మదియు, ధర్మనిరతి
యమరు వారి నడుగుట నందమె యగు 1053

దావరికము కల నయిన దలప నట్టి
జనుల నడుగుట యిచ్చుట కెనగ చెలగు 1054

ఉర్వి దాచుకోనని దాత లుండు కతన
యాచక జనులు మే కొందు రట్టి వృత్తి 1055

దావరికపు టిడుమ లేని దాతల గన
నడుగు వారి లేమి యిడుమ లన్నియు చెడు 1056

నింద, గేలి చేయని దాత ముందు కనిన
నందముగ యాచకావళి డెంద మలరు 1057

యాచకులు లేని విశ్వము తోచు కొయ్య
బొమ్మ త్రాటిచే నటునిటు పోవుపగిది 1058

అడుగు వారులేని యెడల విశ్వంబున
నిడెడివారు కీర్తి బడయు డెట్లు? 1059

క్రోధమూన దగదు యాచకుండు; లేమి
నాతడుంటయె కారణ మగును సుమ్ము 1060

# 107. యాచనాభీతి

దాచుకొనక తృప్తి నొసగు దాతనైన
కోరకుండుటయే మేలు కోటిరెట్లు 1061

అడిగి జీవింప కొందరి నట్లు చేసె
నేని చెడు గాక బ్రహ్మయు నిడుమల బడి 1062

యాచన గొని లేమి యిడుమ నడచెద మని
తలచు దోషము వంటి దితరము లేదు 1063

పుడమి పట్ట నంతటి కీర్తి పొడము, లేమి
యందును నడుగని సుగుణం బమరియుండ 1064

నీరువంటి యంబలియైన నిండు రుచిని
కష్టఫలమును భుజియింప కలుగ జేయు 1065

ఆవునకు నీరడిగినను నడుగుట యను
నది రసనకు నీచతనిచ్చు నంశమె యగు 1066

అడిగియు నొసగని జనుల నడుగకుండు
డనియె యాచించు చున్నాడ యాచకులను 1067

కావులేని యాచన మను కలప నౌక,
బ్రద్దలగును దాపరికపు బండ తగుల 1068

కరగు మనసు యాచన నెంచ కలిగియుండి
మరలు పరచు వారి దలంప మడియునదియె 1069

లేదని వినగ ప్రాణముల్ లేని వగును
దాచు వారికి ప్రాణముల్ దాగునెచట? 1070

# 108. నీచత్వము

జనుల వలె నుందు రథములు కనము మేము
పోలికటు వలె నెచటను పుడమి లోన 1071

సజ్జనుల కంటె నీచులె సౌఖ్యవంతు
లట్టివారి మదిని దిగు లరిది యగును 1072

వేల్పు లట్టి వా రథములు వెరపువీడి
మది బోడమినట్లు వర్తిల్లి మనెడు వారు 1073

నీచుడు తనకంటె నీచుని గని తానె
యధికుడనుచు గర్వమందు చుండు 1074

అథముల నడవడికి హేతువరయ భయమె,
ఆశయు నొక కారణమయి యనుసరించు 1075

తప్పెట లగు వారథములు తామెకోరి
గుట్టుల వివరింవగ తలపెట్టువారు 1076

చెంప జరచు వారికి దప్ప చిందనెంచ
రన్యులకు నెంగిటి కరము నథము లవని 1077

మొరవిన పెద్ద లిత్తురు చెరకు పిండి
నట్లు పిండిన గాని యీ యరథము లిల 1078

ఇతరులు తిని ధరించుట కీసుజెంది
తప్పు లెంతురు నీచులు త్వరిత గతిని 1079

అథము లెందు కర్హు లు? కష్టమావహిల్ల
యమ్ముకొంద్రు తమను తామె యతిశయముగ 1080

## సంయోగము

### 109. సొగసు కలత రేపుట

వేల్పు పడతియో! నెమలియొ! విమల కర్ణ
భూషిత మనుజ కన్యయొ! పొరబడు మది 1081

చూచెనామె, బదులు చూడ చూచె మరల
దండుతో మార్కొనెడు వేల్పు తరుణి వోలె 1082

మును పెరుగను యముని నేను కనుల గంటి
పోరు నలుపు పెనుకనుల పొలతియందు 1083

స్త్రీత్వ మొలయు నా యబలకు చెలగు కనులు
భిన్నమై, చూడ నుసురులు పీల్చుకతన 1084

కాలుడో! కనులో! హరిణమొ! కలికి చూడ్కు
లనగ మూడును కలిసిన యతిశయంబు 1085

బొమలు వంకర గాక సమముగ మరుగు
పడిన భయము గొల్పదు నాకు పడతికనులు 1086

మగువ వాలని చనులపై మసలు పైట
మదగజము మీది మొగవడ మదిగ పొలుచు 1087

పగరు సమరమున వెరచు బలము, సుదతి
సొబగు లీను నుదుటి కోడి సొలసెను గద 1088

హరిణి వలె చూపు, లజ్జయు నమరియుండ
తొయ్యలి కనువు గాని యా తొడవు లేల? 1089

కల్లుగైకొను వారికె కాని కైపు
కలుగదుకద? కన్నంతనె కామము వలె 1090

# 110. గురినెరుగుట

ఇంతి కను లిరుభంగులనెనగు, నొకటి
తాపమొనగు, మరియొకటి తగిన మందు 1091

ఆమె నను జూచు కొరచూపు నందు తెలియు
కామ మది నగ మన రాదు కడు నధికము 1092

కాంచినది కాంచ తల వాల్చె, కాంత పెంచు
చెలిమి మొలక పెరుగ నది జలము సుమ్ము 1093

నేను చూచిన, నేలను తాను జూచు
చూడనపుడు మెల్లగ తాను జూచినగును 1094

సూటిగా జూడమియె కాక చూచు నామె
యోరకంట, చూచి మదిలో నొందు ముదము 1095

అన్యుల వలె పలికినను నంతరంగ
మున హితోక్తులనియె వేగముగ తెలియును 1096

పగయెరుగని పరుషవాక్కు పగరచూపు
వరలుటది ప్రేమ కలవారి గురుతు లగును 1097

నయమున గనిన నఖియ తానవ్వు, నపుడు
మెల్లనడచు చెలియ కొక మిసిమి పొనగు 1098

ప్రియులు సామాన్య దృష్టుల పెరల భంగి
చూచుకొనుట లక్షణముగ తోచుచుండు 1099

కనులతో గనులు కలిసి పెనగి యుండ
పలుకుల వలన నొనగూడు ఫలము లేవి? 1100

# 111. సంయోగ సౌఖ్యము

కని విని తిని మూర్కొని తాకి కనెడు సుఖము
లైదు కలవు గాజుల దాల్చు నీమె యందె 1101

వ్యాధులకు మందు వేరుగు; వనిత వలని
వ్యాధికి రమణి కరుణయే వరలు మందు 1102

కలికి భుజముపై శయనించు కంటె వంక
జాక్షు వానమైనను సుఖమైన దగునో? 1103

దూర మేగ కాల్చు, దరిని చేర చల్ల
బరచు వింత నిప్పును చాన బడసినదెటో? 1104

పూల దాల్చు కురులు గల పొలతి భుజము
లొసగు ముదము కోరిన వెల్ల పొసగినట్లు 1105

పడతిని కలియు నపుడెల్ల పల్లవించు
ప్రాణ, మామె భుజ మమృత భరిత మగును 1106

తనదు సిరినింట విభజించి తినుటయె యగు
కలగ నీ శ్యామ సుందరి కౌగిలింత 1107

గాలి సోకని బిగి కౌగిలి యొరిమిక
నుండు ప్రియుల కొసగు నిండు ముదము 1108

పొలయలుక, హేతువరయుట, కలయిక యను
నవి ఫలములుగ ప్రియులకు నమరు చుండు 1109

చెందొదవుల చెలియపొందు పొంది ప్రేమ
నెరుగుట, చదువ తెలివిడి నెరుగుట యగు 1110

# 112. సౌందర్య ప్రశంస

మృదు శిరీషమా! వర్ధిల్లు సుదతి నాదు
చెలియ నీకంటె మృదులమై చెలగుచుండు 1111

అలరుల గని చెలికనులు పలువురు గను
పూలనెనయునని మనస! పొరబడెదవు 1112

ఇగురు మేను, ముత్తెపువళ్లు, నీటెకనులు,
గంధము మది, వేణుభుజము కాంతకమరె 1113

కలువలకు కనులుండిన చెలికనులకు
పోల మని యెంచి తలవంచి పుడమి జూచు 1114

తొడిమెతో గూడు దిరిసెనా ల్దొడిగె వెలది
కౌనునకు తప్పెటధ్వని కలుగ బోదు 1115

కలికి ముఖమను చంద్రుని కని తడబడి
నిలువక తిరుగు చుక్కలు కలత జెంది 1116

తరుగు నపుడెల్ల మెలమెల్ల పెరుగు శశికి
కల కలంకము వనితకు గలదె! లేదు 1117

కాంత వలె కాంతు లీనిన కలువరేడ
నాదు ప్రేమ కర్హుడ వౌదు నయము మీర 1118

పూల కనుల చాన ముఖము పోలియుండ
నెల్లరు గన చరింపకు మెందు చంద్ర 1119

హంసతూలిక, దిరిసెన పలరులు చెలి
పాదములకు పల్లేరుల పగిది తోచు 1120

# 113. ప్రణయ ప్రశంస

(అతడు)

పాలతో తేనె కలిసిన వగిది వరగు
మధుర వాణి దంతము లందు మసలు నీరు 1121

తరుణితోనాదు బంధమ్ము తనువుతోడ
ప్రాణమునకు నేర్పడు నట్టి బంధమగును 1122

కంటి పాప నున్న నెలత? కదలి పొమ్ము
నాదు ప్రేయసి నివసింప లేదు చోటు 1123

ఉసురునకు జీవన మొసగు నువిద నన్ను
కూడునపుడు, చావునొసగు వీడు నపుడు 1124

పోరు సలుపు కనులు గల పొలతి గుణము
మరచిన తలపదగు నేను మరచుటేది ? 1125

(ఆమె)

కనుల వీడడు కనులార్ప కలత చెంద
డన్మదీయుడౌ ప్రియ సఖుండతి సరళుడు 1126

కనుల గలడు ప్రియుడు కాన కానడనియె
కాటుక నలద మానితి కనులలోన 1127

ఎడదనుండు ప్రియుడు బాధ పడయు ననియె
వలదని తిన నొల్లనువేడి వస్తువులను 1128

కనుల నార్ప సఖుని రూపు కానకుండు
నంతనె నెనరు లేని వాడంద్రు జనులు 1129

ఎదనెపుడు నెలకొను సఖు నెరుగక జను
లప్రియు డనియు, నను వీడె ననియునంద్రు 1130

# 114. బిడియముడుగుట

(అతడు)

విరహ బాధ ననుభవించు పురుషులకిల
గలదె తాటి గుఱ్ఱమొకటి కాకతోడు 1131

ఒడలు నునురును పాటున కోర్వలేక
సిగ్గువీడి యశ్వము నెక్క మొగ్గు చూపె 1132

మగటిమియు నానయును గల్గి మనితి నప్పు
డిపుడు కామాతురుల నశ్వ మెన్ను కొంటి 1133

బిడియము మగటిమి యనెడు పడవలు వడి
వడిగ పోవు కామమనెడు వరదను పడి 1134

దండవలె గాజులను దాల్చు తరుణి వలన
నశ్వము, ముని మాపటి విరహమును గంటి 1135

తాళ హాయమెక్క రాత్రియు దలచుచుందు
కనులకు నిదుర కలుగదు కాంత వలన 1136

జలధి నిభ కామ తాపము కలిగియు చెలి
యశ్వ మెక్కదు గొప్పదౌ నతివ జన్మ 1137

(ఆమె)

చపలు రాలను కంపకు చాలిన దని
యెంచకయె కామ మది రచ్చ కీడ్చు చుండె 1138

ఎరుగ రందరని తలంచి మరులు గొనుచు
తిరిగె నాదగు కామంబు తెరువున బడి 1139

మేము పడుచుండు బాధలు తాము పడమి
కను లెదుటనె పరిహాసింత్రు జనులు మమ్ము 1140

## 115. అపవాదము తెలియజేయుట

(అతడు)

నిలిచె ప్రాణమ్ము లపవాదు వలన, దాని
పలువు రెరుగ కుండుట మాదు భాగ్యవశము 1141

అలరు కనుల కలిగి గొప్ప నరయక యప
వాదుల నొదివి రీ యూరి వారు మాకు 1142

తగనిదో యూరెరుగు నింద దాని పొంద
కుండినను పొంది నటుల మే లొంద జేయు 1143

నింద వలన పెరిగె మాదు నెయ్యమదియె
కూడ కున్న నైజ ముడిగి క్రుంగి యుందు 1144

కైపు మీరు కొలది వేడ్కగల్లు గ్రోలు
పగిది దూరు వలన ప్రేమ పరిఢ విల్లె 1145

(ఆమె)

ప్రియుని జూచితి నొకవరి ప్రిదిలె నింద
పాము మ్రింగిన జాబిలి భంగి భువిని 1146

నెయ్యపునొగులు వర్ధిల్లె నింద యెరువు
నై, జనని కటూక్తులు నీరునై నెగడగ 1147

నిందచే ప్రేమ నణచుట నేయి తోడ
నిప్పు నార్ప నుంకించుట కొప్పియుండు 1148

భయము వలదనిన సఖుడె పలువురు నగ
నను విడువ నపనిందకు నాను టేల? 1149

దూరునేము కోరినటులె ఊరు నుడివె
కాన నఖుడిచ్చ గొనినట్లు కరుణ జూపు 1150

# 116. ఎడబాటు సహింపమి

(ఆమె)

నుడువు మెడబాటు లేనిచో వడి మరలెద
నని యనగ నుడువుము విని మను జనులకు 1151

ముదము గూర్చె నతని చూపు మునువు; నేడు
చెలుని పొందు వీడునొయను చింత గూర్చె 1152

వెలయు నెడబాటు ప్రియులకు విజ్ఞులైన
నట్టి చోనమ్ము మటొ విడువననెడు మాట 1153

వెరపు వలదనిన సఖుడె విడిచి పోవ
నమ్మి మెలగిన పొరబాటు నాదగునొకొ 1154

కావనెంచిన నెడబాటు కలుగకుండ
చూడదగు వీడిన పిదవ కూడు టరిది 1155

చెలియుడెడబాటును తెలుపు తులువయేని
మరలి ప్రియము జూపు ననెడు మాట కల్ల 1156

జారు ముంజేతి గాజులె చాటు నూరి
జనులకు సఖుడు ననువీడి చనిన విధము 1157

ఇష్ట జనులు లేక మనుట కష్ట మంత
కంటె దుఃఖ మొసగు చెలి కాడు తొలగ 1158

కాల్చు నగ్ని తాకిన, మరి కామ తావ
మట్లు కాల్చ గలదె? తాకనపుడు కూడ ? 1159

ఎడయు టోర్చి కలత వీడి కడిది విరహ
తాపము సహించి మనువారు ధరణి కలరు 1160

# 117. విరహముతో కృశించుట

(ఆమె)

దాచగలను కాని విరహ తాపమదియు
తోడిన పెరుగూట పగిది తోచ సాగె 1161

అడప లేను తాపంబును వెడలి తావ
కారకునికి తెలియజెప్ప కలుగు సిగ్గు 1162

కామమును లజ్జయు నుసురు కావడిగొని
యూగుచుండు వెతల కుందు నొడలియందు 1163

కలదు ప్రేమ యనెడు జలధి దాని గడచి
గట్టు జేర్చు నావ కాన రాదు 1164

చెలిమితో వెతను కలుగ జేయు నతడు
పగయడంచు బలము జూప బాధలెన్నొ? 1165

కామము సుఖము కలిగింప కడలి నొప్పు
కలత గలిగింప పెద్దదౌ కడలికంటె 1166

కామవాహిని నీదియు కానజాల
నొడ్డు, రేయి నొంటరినయి యుంటి నేను 1167

మొనసి జీవాల సుఖనిద్ర ముంచి నన్ను
తోడు గొనిన రాత్రిని చూడ తోచు జాలి 1168

కఠినుడై చన్న నిర్దయు కంటె నిపుడు
దీర్ఘరాత్రులె కఠినమై తెలియసాగె 1169

మనసు వోలె నఖుని చేరి మన గలిగిన
కనులు కన్నీటి వరదలో మునుగ బోవు 1170

## 118. దర్శన జనిత దుఃఖము

(ఆమె)

కనులు చూప, నే జూడగ కలిగె బాధ
ఇప్పుడవియె యలమటించి యేడ్చు టేల? 1171

అపుడరయక చూచి వలచి యిపుడు వలపు
తగవెరుంగక కన్నులు వగచు టేమి 1172

నాడు తామె గాంచి కనులు నాథువలచె
వలవరించు నిపుడు, నగుబాటు కాదె! 1173

బ్రతుకు నీడ్వ జాలని యట్టి బాధనుకను
లిచ్చి యేడ్వలేనట్లు నీరెండి పోయె 1174

కడలి యోర్వని కామంబు కలుగ జేసి
కునుకు రాక పరితపించు కనులు నేడు 1175

కామ బాధ మా కొసగిన కనులు తాము
నట్టి బాధ నొందుట జూచి యలరు మనను 1176

ఏడ్చియేడ్చి నీరంతయు నింకి పోవు
గాక? కోరికోరి ప్రియుని కనిన కనుల 1177

కలడు కద! మనసీయక కల్లలాడు
ఘనుడు, కనులు వాని గనక కనవు శాంతి 1178

చెలుడరిగినను నున్నను చెడును నిదుర
వీని నడుమ కనులు పెనువెతను పొందె 1179

తప్పెట వలె కనులు చాటి చెప్పనరిది
కాదు పల్లెజనులు గుట్టు కనుగొనంగ 1180

# 119. వైద్యము

(ఆమె)

ఒడబడితి నెడబాటు కపుడు వెలవెల
బారు నా నైజముతెలియ బరచుటెటులొ? 1181

సఖుడొనర్చెనను పెరిమె చాట, వెల్ల
బాటు మేని యందంతయు పర్వసాగె 1182

చాయ, నానలను గొనియె సఖుడువెల్ల
బాటు, కామ తాపంబుల బదులొసంగి 1183

తలతు, నుడువుదు చెలికాని తగుగుణముల
మరువెల్వెల్ల మాయయో! మరియొకటియొ! 1184

అదిగో! చెలికాడు నన్వీడి అరుగుచుండె
ఇదిగో! మేనవెల్లదనముఎదుగసాగె 1185

దివ్వె యారుటకై చూచు తిమిరము వలె
విరహమునకై యెదురు చూచు వెల్లబాటు 1186

చెలుని కౌగిట నుంటిని తలగితి నిను
మంత, వెల్లబాటంతనె యల్లుకొనియె 1187

వెలరు వారె నీమెయనుచు పలుకువారె
కాని సఖుడేగె నను వారు కానరారు 1188

నమ్మతిల జేసి వెడలిన సఖుడు లెస్స
నుండు నెడమేన పాండుర ముండుగాక! 1189

వెల్లవారితి నను నుడి వినుట మిన్న
సఖుడు వీడెననెడు నింద నలుపకున్న 1190

# 120. పెను విరహము

(ఆమె)

వలచిన చెలికాడె తనను వలచిన నది
బీజ రహిత ఫల మనెడు ప్రేమ ఫలము 1191

వలచు లేమను తానును వలచుట యన
నుర్విగావ మొయిలు వాన నొసగుట యగు 1192

వలపు గల చెలుడు కలుగ వనిత కదియె
కలిసి జీవింత మనియెడు గర్వమొసగు 1193

వలపులేని ప్రియుని గల వనితజగతి
కీర్తి గనినను సుఖమున కెరల గలదె 1194

వలపు చూపక చెలికాడు వరలెనేని
సుదతి కాతడు కలిగించు శుభములేవి? 1195

ప్రేమ యొకవైపు నున్నంత ప్రియము కాదు
కావడి బరువు వలె నున్న కలుగు సుఖము 1196

ఒకరి యెదనె కాముడు కొలు వుండు కతన
కానలేడొ! యతడు నాకు కలుగు వంత 1197

వలపు చూపువాని మధుర వాక్కు వినక
మనెడు నట్టి కఠినులను మహిని గలరె? 1198

సఖుడు మరలి వచ్చి ప్రియము సలువడైన
నెసగు వాని కీర్తియె నాకు నింపు గూర్చు 1199

మనస! వర్ధిల్లు! సుడువకు మమతలేని
యతనికి వెత, నంత కు దధి నడప వచ్చు 1200

# 121. తలచి విలపించుట

తలచి నంత పెను ముదము తరలి వచ్చు
కడు మధురమై వరలు ప్రేమ కల్లుకంటె 1201

తలచి నంతనె వేగమ తలగు బాధ,
యెట్టి దైనను ప్రేమచే పుట్టు ముదము 1202

(ఆమె)

తలపనెంచి తలవడొకొ! చెలుడు; తుమ్ము
పూనినట్లె తోచి తుదకు రాని దయ్యె 1203

నాదు డెందమున కలడు నాథు డట్లె
అతని డెందమున కలనొ అనవరతము 1204

తన మదిని చేరనీయడు నను, నిరతము
చెలుడు నా మది జొరబడు, సిగ్గులేదె! 1205

కలిసి యుండిన కాలమ్ము తలచి మనుచు
నుంటికాని ప్రాణము లెటు లుంచు దాన 1206

మరువక తలచినను కాల్చు మదిని; నఖుని
తలప మరచిన యెదయెట్లు వెలయునొ మరి? 1207

ఎంత తలచినను చెలికాడెరుగ డలుక,
తలపనదియె కా నాతడు సలుపు మేలు 1208

విలయ మందు ప్రియానువుల్; తొలి, యిరువుర
మొక్కరమనిన నఖుడు నే డొల్లకున్న 1209

నను విడువక వీడిన నాథు గనెడు వరకు
కను మరుగు కాకుమా! యోయి కలువరేడ! 1210

# 122. స్వప్న స్థితిని నుడువుట

(ఆమె)

చెలుని సందేశముల తోడి కలకు విందు
నెట్టి దాని నొనగి సత్కరించగలను? 1211

కోరినటుల కనుల మూత గొనిన యెడల
చెలునికి బ్రతికిన విధము తెలియజేతు 1212

మెలకువ తరి నన్వలవని చెలుని కలను
గాంచి నందున నసువులు గల్గియుంటి 1213

కలను దోచు కామఘటన మెలకువ తరి
యెద వలువని చెలిమికాని వెదకు కొరకె 1214

తెలివిని గనినదియు నిప్పు కలను గాంచు
నదియు ననుభవ మప్పుడ ముదము గూర్చు 1215

మెలకు వనుట లేనియెడల కలను గాంచి
నట్టి చెలికాడునన్వీడి యరుగడెపుడు 1216

మెలపు కొన్నపుడు వలచి యేలు కొనని
పతియె కలలోన పీడింప పాడియౌనె? 1217

నిద్రయందు భుజములపై నెగడు నఖుడు
గుండెలోన దాగు మెలపు గొనిన యంత 1218

కలను చెలికాంద్ర గాంచని చెలులు మెలపు
తరి వలవని నఖుల దూర దలచు చంద్రు 1219

మెలపు తరి వీడెనని దూరు నలువు, వాడ
జనులు గాంచరొకొ నఖుని స్వప్నమందు 1220

# 123. ప్రొద్దు చూచి విలపించుట

(ఆమె)

నీవు నంజ వేళవు కావు నిజము నుడువ
పొలతుల యసువులడచెడు ప్రొద్దువౌదు 1221

కలతగొంటి వేలొకొ! ప్రొద్ద! కాంతితరిగి;
చెలుని వలె కఠినుడె నీదు చెలుడు కూడ 1222

మంచు వలన వెల్వెల బోయి మ్రగ్గ ప్రొద్దు
మదిని కలచె, పెంచె మరింత యెదకు వంత 1223

వధ్యభూమిని చేరెడు వగతుర వలె
చెలుడు లేనియపుడు సంధ్య చేర్చవచ్చె 1224

సలిపిన హిత వెట్టిది తొలి సంజకు, మలి
సంజ కహితము నేనేది సలిపితి నొకొ! 1225

చెలుడు నను బాయ నప్పుడు తెలియనైతి
సంధ్య నాకిట్టి బాధను సలుపు ననుచు 1226

మొనయు తాపము, వేకువ మొగ్గతొడుగు
సాగు దినమందు కుసుమమౌ నంజ వేళ 1227

అనలమై కాల్చు మలిసంజ కనుగు దూత
గ, నను చంపు సైన్యముగను తనరు మురళి 1228

నంజ మది మత్తు నొందించు సరణి రాగ
నా వలె తపించు నీ యూరు నవయునపుడు 1229

ధనము కొరకేగిన సఖుని తలచి నంత
సడలని యునురు మాయు నీ నంజవేళ 1230

# 124. అంగముల సొగసరుట

(ఆమె)

కలత ముంచి చనె నఖుడు, తలచి యేడ్చు
కతన పూలకు సిగ్గిలె కన్నులకట! 1231

వెల్లబారి నీరు దొరల వెలయు కనులు
చెలుడు వలవమి కాబోలు తెలుపుచుండె 1232

చెలుని యెడబాటును దెలుపు కలిసియున్న
నాడు పొంగిన భుజములు వాడు నపుడు 1233

తోడు వీడినందున చాల పోడిమి చెడి
వాడెను భుజములవి, గాజు లూడ సాగె 1234

ఊడు గాజు, లందము చెడి వాడు భుజము
నఖుని హృదయపు క్రౌర్యమ్ము చాటసాగె 1235

వడలు భుజ యుగళి, నడలు తొడవుల గని
చెలుడు కడిది వాడన, నేను కలతపడుదు 1236

పేర్మి నొందుము హృదయమా! ప్రియునికి భుజ
యుగళి వాడి యార్చు విధము నొనర బలికి 1237

(అతడు)

కౌగిలింత కొంత నడల గనె చెలిదగు
పసిడి తొడవుగల నుదుటి వన్నె తరిగె 1238

కౌగిలి నడుమ చల్లని గాలి దూర
వెలది జడివాన నయనాలు వెల్లనయ్యె 1239

కలికి నొగులు వెలరు వార గనిన యామె
కనులు వైవర్ణ్య మయ్యెద కలతజెందె 1240

# 125. స్వగతము

(ఆమె)

చిత్తమా! యరసి చెపుమా! చెదరని పెను
తాప వేగమును హరింపదగును మందు 1241

మనమ! వర్ధిల్లు! వలవని తనను దలచి
బాధ నొందెద వవివేక ఫలిత మదియ 1242

నా యెడ నమరిన మనమా! నవయు టేల?
వంత నొనగు వానికి చిరు చింత లేదు 1243

కనుల గొని పొమ్ము హృదయమా! కాంతు జూడ
గోరి యవి నన్ను మిక్కిలి పోరు వెట్టు 1244

వలచినను నను వలవని వాడనంగ
తలచి యాతని విడుచుటతగునొ మనమ! 1245

కలిసి లాలించి గల సఖుగని యలుగవు
కనలు చుంటి వీవు మనమ! కల్ల కినుక 1246

వలపునో, సిగ్గునో వీడి వర్తిలుము సు
హృదయమా! రెంటినే భరియింపలేను 1247

వలపు చూవడు ప్రియుడని వంతనొంది
పిరుద నేగ జూతు మనమ! బేల వీవు 1248

హృదయమ! సఖుడు నీయెడ నెనగుచుండ
అరిగెద వెవరి దాపుకు నతని గాంచ? 1249

వలపు చూవక కఠినుడై వీడిన సఖు
నెడద నుంచిన, నింతకు చెడును సొబగు 1250

# 126. స్థైర్య ముడుగుట

కామ పరశువు, సిగ్గను గడియ కలది
యైనను నిలుపను తలుపు నడగ జేయు 1251

కామమొకటి కరుణహీన! కటిక రాత్రి
యైన ప్రభుత నెరవు జూపు నది యెదపయి 1252

వలపు దాచ దలతు నేను నిలువక యది
తుమ్ము వలె తానే వెలువడి తోచు నుమ్మ 1253

ఎడద స్థైర్యము గలదని యెంచి యుంటి
వలపు మరుగు మీరి బయలు పడెను తుదకు 1254

విడిచి చనిన వారి వెనుక చనని గొప్ప
దనము కాముకులకు తనరు టేది? 1255

వీడి చనిన సఖు వెనుక వెడల దలతు
వట్టి పీడించు రుజయది యెట్టిదయయొ! 1256

వలచిన చెలికాడు వలయు వలపు చూపె
నేని యపుడు నాన గుణము నెరుగబోను 1257

మాయలెరుగు కల్లరి కల్ల మాటలె కద
స్త్రీత్వమను కవచంబును చీల్చుదండు 1258

అలుగ నెంచితి కాని నే నిలుపు డిగియె
కౌగిలించితి నెద తాను కలియ జూచి 1259

అనల మందలి క్రొవ్వు భంగి నయహృదయ
లగు చెలుల కుండునె యలుక యనెడు నిలుపు? 1260

# 127. పరస్పర వాంఛ

(ఆమె)

అతనికై చూచి నయనము లలసె మిసిమి
చెడ, చనిన నాళ్లు గుర్తించి చిక్కె వ్రేళ్లు 1261

చెలుని నేడు మరతు నేని చెలువ ముడిగి
భుజము లడగి జారు ధరించు భూషణములు 1262

విజయమెన్ని యుత్సాహంబు వెంటరాగ
వెడలిన పతి వచ్చునని జీవించి యుంటి 1263

వలపు కలయిక వీడిన వాని రాక
నెంచి యెద తరు శాఖల నెక్కి జూచు 1264

చూతు చెలికాని కనులార - చూచినంత
వాడిన భుజముల తొలగు వెల్లదనము 1265

వచ్చునొకనాడు చెలికాడు వచ్చిన తరి
వేగ కూడుదు నాతని విరహము చెడ 1266

అలుగుదునో? కౌగిలింతునో, కలియుదు నొకొ!
కనుల వంటి సఖుడు నను కలియ రాగ 1267

(అతడు)

గెలుచు గాక రాజు, పిదప పొలతి గూడి
నాటి మలిసంజ కిడుదును మేటి విందు 1268

ఒక్క నాడేడు నాళ్లటు నిక్కిసాగు
చనిన చెలి కాంద్రకు వగచు చెలుల కెల్ల 1269

చెలియెద వగిలిన వెనుక కలియజూడ
నేమి? కౌగిలింత నెరవ నేమి ఫలము? 1270

# 128. గురులెరుగ జెప్పుట

(నాయికా నాయకులు కలిసినప్పుడు - నాయకుడు)

దాచ దలచినను నుడువ దలచిన యది
కలదని నిను మీరి కనులు తెలుపు నాకు 1271

చెలువమును, వేణువుల వంటి చేతులు గల
నతికరయ స్త్రీత్వభావము చాలమెండు 1272

మణి సరమ్మున దారమ్ము మసలు భంగి
పడతి యందమువ గలదు భావ మొకటి 1273

తొడుగు ముకుళ మందలి తావి యడగినట్లు
భామ చిరునవ్వున వెలయు భావమొండు 1274

ననుగని చెలియొనర్చిన నర్మభావ
మదియ నా పెనుదుఃఖము నడచు మందు 1275

(నాయిక)

వలపు మిగుల జూపి నఖుడు కలియుట గన
విడిచి వెడలు ననెడు గురి వెలయు నందు 1276

చలి గలుగు దేశమున నుండు చెలుడు నన్ను
విడుచునని మునుపె యెరిగె కడియములవి 1277

విడిచె వెడలె నఖుడునిన్న, గడిచె నేడు
దినములు మెయి నిండుగ వెల్లదనము సోకి 1278

(నాయకుడు)

కడియముల జూచె, భుజముల గనె, యడుగుల
గన్నది, గరిత చేసిన చిన్నెలవియ 1279

కనులలో తావము వెలార్చి చనకు మనియె
చీరు బావము నుత్తము స్త్రీత్వ మంద్రు 1280

# 129. సమాగమ వాంఛ

(నాయిక)

తలచిన సుఖంబు, తిలకింప గలుగు ముదము
వలపునకు గల్గు; కల్గుకుం గలుగ దవియె 1281

వలపు తాళ ప్రమాణము చెలగునపుడు
ఆవగింజ యంతేనియు నలుకతగదు 1282

వలపుడిగి తన యిచ్ఛకు వర్తిలినను
కన్నులుండ లేవు చెలుని గాంచకుండ 1283

చెలి! యలుగనెంచి వెళ్లితి చెలుని కడకు,
తలపు మరచి యెదవెడలె కలియుటకును 1284

కాటుకను దిద్దు తరి పుల్ల గనని కనుల
వగిది కనలేను తప్పుల పతిని గనిన 1285

అతని గాంచినప్పుడు తప్పు లరయలేను
కాంచనపుడొప్పు నొకటియు గాంచలేను 1286

వెల్లువ గొని పోవు టెరిగి వెంట దూకి
నట్లు ఫలము లేని దెరిగి యలుగు టేల? 1287

త్రావనెన్ని యవజ్ఞలు తలపడినను
కోరికొను కల్లు; కల్లరి! గుండె నీకు 1288

(నాయకుడు)

అలరు కంటె కోమలమగు వలపు; నెరిగి
ఫలము గొనువారు కొందరె కలరు ధరణి 1289

కనుల కనలి, నా కంటెను మును పె తాను
కౌగిలింప నెంచి, వెనుక కలగె లలన 1290

# 130. ఎదను మందలించుట

(నాయిక)

అతని హృదయము తోడ్పడు నతనికి యది
యెరిగియు మనమ! తోడ్పడ వేల నాకు? 1291

మనమ! వలపు చూపని వాని వెనుక, కినుక
చూపడని తలచియె చేరబోయెదవటె? 1292

హితులు చెడిన వారికి లేరని తలచియొకో
మనమ! కోరినట్లాతని వెనుక చనుట 1293

మనమ! కినుక బూని ఫలము ననుభవింప
విక, నినుగలిసి యెంచు వారెవరు గలరు? 1294

పొందమికి జంకు జంకును పొందిన విర
హమున, కిటులెద వెతనొందు ననవరతము 1295

చెలుని బాసి యొంటరినయి తలచినపుడు
నన్ను తినునట్లు చెలరేగె నాదు మనము 1296

నాన మరచితినిప్పుడు నాథు మరువ
జాలని వెడగగు మనము సరసజేరి 1297

ప్రాణ మందలి తీపిచే పతికి నింద
కూడదని యెంచి యెద వాని గుణము లరయు 1298

(ఇరువురు - తమలో)

దుఃఖమున తమ హృదయమె తోడు గాక
మరియొకరితోడు మహిలోన మనకు గలదె? 1299

తన హృదయమె చుట్టంబుగా తనర నప్పు
డొరులు బంధువులై యుండు టరిది నిజము 1300

# 131. ప్రణయ కలహము

చెలి! యతని కూడ కుండుము కలిసి కౌగి
లింత యిడకుము చూతమొకింత కలత 1301

తగిన యుప్పిడుట యలుక తాను గొనుట,
అలుక యెక్కువగుట యుప్పనధిక మిడుట 1302

(నాయకుడు విన నాయిక)

అలుగు సఖుగౌగలింపమి కలత గొనిన
వాని మరిమరి విలపింప వంతనిడుట 1303

వాడు తీగను మొదలంట యూడ బెరికి
నట్లగు నలుగు వారిపై యరితి గొనమి 1304

(నాయకుడు తనలో)

సుగుణలైన పురుషులకు సొంపు, అలరు
కనుల పడతుల యెదతోచు కినుకయె యగు 1305

పొలయలుక, కినుకయులేని వలపు మిగుల
పండుగనో, కాయగనో వ్యర్థ ఫలితమొనగు 1306

కలయిక యిక సాగదోయని పొలయలుకను
దుఃఖ మొక్క విధంబుగ దోచుచుండు 1307

(నాయిక విన నాయకుడు)

తన కతన నితడు కలత దాల్చె ననగ
తలచు చెలిలేక ఫలితము కలుగు టేది? 1308

నీడ నున్నయపుడె తీపి నీరు, అటులె
వలపు గల వారి యొద్దనె అలుక తీపి 1309

అలిగి నవుడలరింపక నడల జేయు
నతివ నెదకూడ నెంచుట ఆశకతన 1310

# 132. పొలయలుక సూక్ష్మత

(నాయిక)

ధూర్త! నారీ ప్రకృతి గల యార్తు లెల్ల
గాంచు నీయెద గని నేను కౌగి లీను 1311

అలుక నేనుంటి, వర్ధిల్లు మని పలికెద
నని తనమదిని భావించి యతడు తుమ్మె 1312

(నాయకుడు)

పూలనే దాల్చినను చెలి పూనుకినుక
తరుణి యొకతె కందము జూప దాల్చితినని 1313

వలచితి నెవరి కంటెను చెలియ నిన్న
నిన యెవరెవరి కంటెను అనుచు కినిసె 1314

నేటి జన్మలో విరహము నేరదనిన
చెలికనులు ముందు జన్మకై చెమ్మగిల్లె 1315

తలచితి నన, మరచిననె తలచుట యని
కలికి కౌగిలి నీయక నలుక దాల్చె 1316

తుమ్మితిని దీవెన లొసగె తోడనె చెలి
ఎవరు తలప తుమ్మితిరని యేడ్వదొడగె 1317

తుమ్ము నాపితి, నీదగు తొయ్యలి నిను
దలప, దాచుచుంటిరనుచు కలగి యేడ్చె 1318

అలుగు తరి ముదమును గూర్ప నగుదురిట్లె
తక్కొరు తరుణుల కనుచు తాను కినియు 1319

ఊరకామె రూపు దలచి యుండ యెవరి
రూపుతో పోల్చెద రనుచు రోయ దొడగు 1320

# 133. పొలయలుక మాధుర్యము

(నాయిక)

చెలుని తప్పు లేకున్నను అలక గొనిన
ప్రియుని ప్రేమ నది మరింత పెంచు గాదె 1321

అలుకచే గల్గు చిరుచింత వలన సఖుని
వలపు వాడినను పెరిమె కలది యౌను 1322

నేలతో నీరు పగిదిగ నెనరు చూపు
సఖుని నలుగు కంటె కలదొ స్వర్గమొండు 1323

కౌగిలి విడువక నిలుప కారణమగు
అలుకలో నెద నడచు దండనగ కలదు 1324

(నాయకుడు)

తప్పు లేకున్నను తరుణి తలిరు బుజలు
వీడి యున్నప్పుడు సుఖము వెలయు నొకటి 1325

తినుటకంటె తిన్న దరుగ తనరు సుఖము
వలపున కలియు కంటెను నలుక మిన్న 1326

అలుక నోడి నట్టి ప్రియులె గెలిచి నట్లు!
అలుక పిదప కలియనది తెలియ వచ్చు 1327

నెన్నుదురు చెమర్పగలియ నెగడు సుఖము
నింకను నలుక వూనంగ నెరుగ గలమె ? 1328

అలుగు గాక యింకను చెలి, చెలగి సాగు
గాక రేయినే బ్రతిమాలి కలియు కొరకు 1329

అలుక వలపున కిమ్మగు నలుక ముగిసి
కలిసి రమియించిన నదియె యలుక కిమ్ము 1330

'కామవాణి' 114 వ శీర్షికలో 'తాటిగుర్రం' 'అశ్వమెక్కడం' వంటి మాటలున్నాయి.

భగ్నప్రేమికుడు తాను ప్రేమించిన స్త్రీని తన కిచ్చి వివాహం చేయమని ఆమెతరపున పెద్దల్ని అడగడానికి ఎన్నుకొన్న మార్గం ఇది. తాటిమట్టలపై తానుకూర్చొని తన స్నేహితులు దాన్ని లాగగా, ఊరేగింపుగా వెళ్లి తన కోరికనువెలిబుచ్చడం దీని ప్రధానోద్దేశం.

ఇది సంగకాలం నాటి ఆచారం. తమిళంలో 'మడల్' 'మడలేరుదల్' అని అంటారు.

## ముద్రణ పొందిన ఇతర గ్రంథాలు

**ఉషాపరిణయము**

(దామర్ల అంకభూపాల కృతం - సంశోధిత ప్రతి)

**కొడాలి సాహితీ సౌవర్చసం**

(కొడాలి వెంకట సుబ్బారావు గారి కృతి పరామర్శ)

**కలలు + కల్పనలు = కాగితాలు**

ప్రణయగీతమాలిక

**(తమిళమూలం : మీరా)**